# అంతేనా?

[చిన్న నవల]

రచయిత:
ఎస్. ఆర్. చందూర్

పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

# అంతేనా!

ఒకే ఒక్క సంఘటన కొందరి జీవితాల్ని తారుమారు చేస్తుంది. అలాంటిదే భరతరావు విషయంలో జరిగింది. ఆ నాడు సెక్రటేరియట్ ఆంధ్రాసంఘం వారి "హరిశ్చంద్ర" నాటకంలో హరిశ్చంద్ర పాత్ర వెయ్యవలసిన బరువు అతని భుజాలమీద పడిపోకపోతే, ఈ కథే జరగక పోను. అంతకు పూర్వం భరతరావు ఏ నాటకంలోనూ వేషం వేసిన వాడు కాదు. సంఘంలోని నలుగురు సభ్యులూ చేరి, యేదో హరిశ్చంద్ర నాటకం వేదామంటే వేదామనుకున్నారు. మిగతా యేర్పాటులలో భరతరావు కూడా కాస్త చేయూత నిచ్చాడు. అసలు ఆ వేషం ధరించవలసినది వైకుంఠం. తీరా అంతా అనుకున్న తర్వాత, ఆఖరు క్షణాన వైకుంఠం మామదగ్గరనుంచి వైరు రావడంవల్ల అతను చల్లగా తప్పు కున్నాడు. మరొకటీ మరొకటీ అయితే అతను మానేసి వుండునేమో, కాని అక్కడ అవుపోసనం, యిక్కడ హరి శ్చంద్ర నాటకం పడేనాటి రాత్రి నిశ్చయమైనట్లు బుడుక్కున వైరిచ్చాడు–మామగారు. పాపం, హరిశ్చంద్ర పాత్ర తానే వెయ్యాలని మహా వుబలాటపడ్డాడు వైకుంఠం. అతనికి ప్రాప్తం లేకపోయింది.

కాని అది భరతరావుకి ప్రాప్తించింది. భరతరావు అంతకి క్రితం నాటకాలు వేసి ఎరగడు. స్కూళ్లోనూ,

కాలేజీలోనూ యెట్టి నాటకమూ వెయ్యలేదు. స్కూల్ ఫైనల్ ఒక ఛాన్సు చూసివచ్చేటప్పటికీ శుభ్రంగా బి. ఎ. పాసై, తండ్రి ప్రాపకంవల్ల సెక్రటేరియట్‌లో ఉద్యోగం సంపాయించాడు. తండ్రి ఏమంత పెద్ద ఉద్యోగస్థుడు కాదు; చిన్న డిప్టీ కలెక్టరు. కొడుకు గుమాస్తాగా జాయినై, కాలక్రమేణా పైకి పోకపోగలడని ఆయన ఆశించాడు. కాని, భరత రావు హరిశ్చంద్రపాత్ర వెయ్యడంతో బండి బోర్లగిలా పడింది.

ఆంతర్యంలో ఈ తమాషా యేమిటో చూదామని ఉన్నప్పటికీ, "నాకు నాటకానుభవం లేదు." అన్నాడు భరతరావు సెక్రటరీతో.

"అనుభవమేమిటిసార్. నేను లోహితాస్యుడి పాత్ర ఎలా వేస్తానో చూడండి, దంచేస్తాను. మొదట అయిదు నిమిషాలపాటు స్టేజి ఫియర్ ఉంటుంది. అప్పుడు వేళ్లు బిగించి, కాళ్ళు బిగబట్టి నుంచోవాలి. మనుషులవంక చూడకుండా వుండటమే మందు. నేనున్నానుగా—మీ కేమీ భయం లేదు" అని ధైర్యం చెప్పాడు సెక్రటరీ. ఆ సెక్రటరీ కాస్త పొట్టివాడూ, కుర్రవాడూ అయివుండటంవల్ల మళ్ళీ అరువు కుర్రాడికోసం దేవుళ్లాడేబదులు, యితనిచేతనే లోహితాస్యుడు వేయించేస్తే బాగుంటుం దనుకున్నారు మిగతవారు.

"మరి ఈ నాటకంలో దమయంతి ఒకటి ఉండాలిగా. ఆ పాత్ర ఎవరు వేస్తారు ?" అని అడిగాడు భరతరావు.

స్త్రీలు స్త్రీ పాత్రలూ, పురుషులు పురుష పాత్రలూ వెయ్యడం నేటి నాటకలోకంలో కనీసధర్మం కనక, ఆ దమయంతి (దమయంతి కాదు-చంద్రమతి) పాత్ర తన టేబుల్‌కి నాలుగు టేబుల్స్‌కి పైగా ఉన్న బక్కపలచని అమ్మాయి వేస్తే బాగుండునని భరతరావు మనసులో ఉంది.

"చంద్రమతి యెప్పుడో సెటిల్ అయిపోయింది. మీనాక్షిని బుక్ చేసేశాం" అన్నాడు సెక్రటరీ.

ఆ బక్కపలచని అమ్మాయి పేరు మీనాక్షిమటుకు కాదు. అంతకీ ఉండబట్టలేక అడిగాడు భరతరావు; మీనాక్షి ఏ సెక్షనులో ఉంది ?"

"సెక్షనేమిటి ?"

"మన ఆఫీసులో అమ్మాయికదూ ?"

పొట్టి సెక్రటరీ కిచకిచ నవ్వి "మనవాళ్ళకి ఆమాత్రం అభ్యుదయం కూడానా ?" అన్నాడు.

సెక్రటరీ, భరతరావూ సెక్రటేరియట్‌లో పనిచేసే అమ్మాయిలకి అభ్యుదయం లేదని యేకీభవించారు. ఆ సాయంత్రం భరతరావు బీచివొడ్డున కూచుని వికాశమ్‌తో తన మెడకి చుట్టుకున్న రోకలిగురించి చెప్పాడు. భరతరావు బి. ఎ. పాసై సెక్రటేరియట్‌లో చేరితే, వికాశమ్ ఎమ్. ఎ. తర్వాత యింక చదివేందుకు యేమీ లేదుగదా అని విచారించే స్థితిలో ఉన్నాడు. డాక్టరేట్ మాత్రం యేమంత ఘనకార్యం అతనికి, భరతరావు తండ్రి చిన్న డిప్టీ కలెక్టరయితే,

విశాళమ్ తండ్రి అలాంటి చిన్న డిప్టీ కలెక్టర్లు పదిమందిని పూరికే కూచోబెట్టి పోషించగలడు. విశాళమ్ తాత బాగా డబ్బు వున్నవాడు; తండ్రి దానిని పదింతలు చేశాడు. మైకా వ్యాపారంలో విశాళమ్ తండ్రి ఎన్ని లక్షలు సంపాయించాడో లెఖ్ఖలేదు. విశాళమూ, భరతరావూ యింటర్ నుంచీ క్లాసుమేట్సు. అభిప్రాయాల సామ్యం వల్ల వారు స్నేహితులు కాలేదు. ఇద్దరికీ మైత్రి టెన్నిస్‌కోర్టులో కలిసింది. ఎన్నో గేములు వాళ్ళిద్దరూ పార్ట్‌నర్స్‌గా ఆడి, నెగ్గుకొచ్చారు. భరతరావు సెక్రటేరియట్‌లో చేరిన తర్వాత టెన్నిస్‌కి స్వస్తి చెప్పాడుగాని విశాళమ్‌మాత్రం మానలేదు. వర్షం పడితే మినహా విశాళమ్ విధిగా టెన్నిస్ ఆడుతాడు.

తను హరిశ్చంద్ర పాత్ర యే పరిస్థితిలో వెయ్యవలసి వచ్చినదీ భరతరావు చెప్పాడు. ఓపికగా విని విశాళమ్ అన్నాడు; "వైకుంఠం అవుపోసనం మరొక ముహూర్తానికి యేర్పాటు చేసుకోవచ్చునుగా!"

"అతనికి హోటల్ మెతుకులు పడటం లేదట అవుపోసనమయితేగాని భార్యను పంపరుగదా మామగారు! ఆవిడ వొచ్చి కాస్త వుడకేసిపెడుతూవుంటే, ఈయనగారి డొక్కశూలలు తగ్గుతుందట"

"డామిట్!"

"మరేమి చెయ్యమంటావు నన్నిప్పుడు?"

"నీ కూ్కడా రంగు పూసుకు తైతక్క లాడాలనివుంది. ఎందుకీ డొంక తిరుగుళ్లు? మీ సంఘం వాళ్ళకి జ్ఞానం లేదు గాని హరిశ్చంద్ర నాటక మేమిటి ఈనాడు! నువ్వు హరిశ్చంద్ర వేస్తున్నావని తెలిస్తే, అరుణ విరగబడి నవ్వుతుంది."

"అయితే, ఆమెకు చెప్పకు" అన్నాడు భరతరావు బిడియ పడుతూ.

"మన్మల్ని పిలవవా?"

"పిలుస్తాను."

"నేను చెప్పకుండా దాచి ప్రయోజన మేమిటి?"

"నాటకం అయిపోయిన తర్వాత చెప్పు."

"ఏమోనబ్బా-నాకుమాత్రం నువ్వు నాటకం వెయ్యడం యిష్టం లేదు."

"నాకుమాత్రం యిష్టమా—యిలా మెడకి చుట్టుకుంది గాని!" అన్నాడు భరతరావు.

వికాశమ్‌కి అతను నిజం చెప్పడం లేదేమోననిపించింది. భరతరావుకి కూడా కాస్తో కూస్తో మనసులో ఉండకపోతే ఎందుకు ఒప్పుకుంటాడు?

"నేను వెయ్యను" అంటే ప్రాణాలు తీస్తారా?

ఏమయితేనేం, వికాశమ్ తన చెల్లెలు అరుణకి, నాటకం రోజు మధ్యాహ్నందాకా, భరతరావు హరిశ్చంద్ర పాత్ర ధరిస్తున్నాడనీ, తామూ సాయంత్రం హరిశ్చంద్ర నాటకానికి వెళ్తున్నామనీ చెప్పలేదు.

మధ్యాహ్నం టీ అయిన తర్వాత యథాలాపంగా అన్నాడు విశాశమ్ అరుణాదేవితో—

"యివ్వాళ మన మొక నాటకానికి వెళ్తున్నాము."

"ఏం నాటకం?"

"జగన్నాటకం మటుకు కాదు—భరతరావు నాటకం."

అన్నగారు మామూలు సంభాషణలో అసందర్భమైన పదాలు దొర్లించడం కొత్తకాదు గనక—జగన్నాటక మేమిటని—అరుణాదేవి ప్రశ్నించలేదు.

"భరతరావు నాటక మనగా?" అని ప్రశ్నించింది."

విశాశమ్ సమస్తం నివేదించగా విని, "ఈ సాయంత్రం కమల బర్త్‌డే పార్టీకి వెళ్ళాలి. నాకు రావడం పడదు. నువ్వు వెళ్ళు" అంది.

అరుణకి భరతరావు పట్ల ఆదరాభిమానాలు వున్నాయని విశాశమ్‌కి తెలుసు. అదేమీ ప్రేమా గీమా కాదు. సెక్రటేరియట్ గుమాస్తాకీ, లక్షాధికారి కూతురికీ మధ్య ప్రేమేమిటి—మతిలేక! విశాశమ్‌కి తీరిక లేనప్పుడు అరుణకి టెన్నిస్ భరతరావు నేర్పుతూ వుండేవాడు. విశాశమ్ కుటుంబానికీ, భరతరావుకీ మధ్యనున్న స్నేహం ఒక రకంగా టెన్నిస్ స్నేహమని చెప్పవచ్చు. అది టెన్నిస్‌తో ప్రారంభమయినప్పటికి మనసుల్ని కూడా కొంతవరకూ దగ్గిరికి తీసుకు వచ్చింది. భరతరావంటే అరుణాదేవికి గౌరవం లేక పోలేదు. కాని, పాత చింతకాయ పచ్చడిలాంటి నాటకంలో

అతను ప్రధాన భూమిక ధరించడం ఆమెను ఎంతమాత్రం మనస్కరించలేదు! వికాశమ్ మొగవాడు. కనక పైకి అనేశాడు; ఆడది కనక ఆమె మనసులో పెట్టుకు, క్రియచేసి పూరుకుంది.

హరిశ్చంద్ర నాటకం, యిలాటి సంఘాలు వేసే అన్ని నాటకాలకిమల్లే నే, అవక తవకలతో సాగింది. లోహితాస్యుడు హరిశ్చంద్రుడికి తమ్ముడో, కొడుకో ప్రేక్షకులకి తెలియలేదు; కాని, నాటకధర్మాన్ని అనుసరించి కొడుకుగానే ఆమోదించారు. భరతరావు తనంత గొప్పగా నాటకం ఆడగలనని అనుకోలేదు. చంద్రమతి వేసిన మీనాక్షి మీదికి వచ్చి ముట్టుకుంటున్నప్పుడు అతనికి భయంభయంగావుండేది. ప్రేక్షకులలో వికాశమేగాని, అరుణాదేవి కనిపించక పోవడం, అతని ప్రాణానికి తెరిపి నిచ్చింది. ఆమె రానందుకు ఆత్మలో సంతోషించాడు.

''మాయామేయ జగంబె నిత్యమని సంభావించి మోహంబునన్ ప్రాణంబుండు నందాక! నా యిల్లాలని నా సుతుడని యెంతో యల్లాడిన ఈ శరీర మిప్పు డిందున్ కట్టెలన్ గాలుచో ఆ యిల్లాలును రాదు, ఆ సుతుడును రాడు విధిని తప్పింపగన్!'' అని భరతరావు పాడగానే, ప్రేక్షకులు తపీ తపీ చప్పట్లు కొట్టడమే కాకుండా ''వన్స్ మోర్'' అన్నారు. ఆ ''వన్స్ మోర్'' వినేటప్పటికి భరతరావుకి నక్షపు సింహాసన మెక్కిన ట్టయింది. మీనాక్షి అతని

మోహంలోకి ప్రాత్రవసింహుణ్ణి చూసినట్టు చూసింది. "వన్స్ మోర్" అనే అగ్నికి మీనాక్షి చూపు ఆజ్యమయింది.

చూపు—ఒక్క చూపు—ముఖ్యంగా కొందరు స్త్రీల చూపులు ఏ భాషా చెప్పలేని కవిత్వాన్ని వొలకబోస్తాయి. మీనాక్షి అలాటి చూపు విసరాలని పసిరి ఉండదు. ఏ రక్త మాంసాలు మానవకోటిలోని భావ సంచలనానికి హేతు భూతా లవుతున్నాయో అవే ఆమెలోనూ ఉన్నాయి. ఇరవై అయిదు రూపాయిల కిరాయికి ఆమె ఈ రాత్రి ఈ నాటకంలో చంద్రమతి అయింది. రేపు యిదే స్టేజీకానికి మరొకచోట దమయంతి అవుతుంది; యింకొకనాడు సీత అవుతుంది; తర్వాత అహల్య అవుతుంది; మండోదరి అవు తుంది; తార అవుతుంది. ఆమె రేటు యిరవై అయిదు నుంచి ఏభై దాకా. పాత్రలన్నీ కంఠోపాఠం. ఇన్ని పాత్రలూ నటించి మెప్పించే పాత్రధారిణి వెనక ఒక స్త్రీమూర్తి దాగి వుంది. ఆ స్త్రీమూర్తే భరతరావుమీద అమృతకిరణం ప్రస రింపజేసింది. అతను పునీతుడవడం, అవకపోవడం వేరు కాని మాయామేయ జగమ్మలో పాదం పెట్టాడు.

మీనాక్షి తల్లి భరతరావుని యెప్పుడైనా తమ యింటికి వస్తూ వుండమని అడ్రస్ యిచ్చింది. సరే నన్నాడతను. అవన్నీ లాంఛనప్రాయం.

గ్రీన్ రూమ్‌నుంచి బయటికి వచ్చిన తర్వాత విశాశమ్‌ని అమితోత్సాహంతో అడిగాడు భరతరావు "నా పెరఫార మన్స్ ఎలా వుంది ?"

"దాని మాట కేమిగాని నువ్వేమవుతావో అని నాకు బెరుగ్గా వుంది."

"అంత భయం దేనికి! నన్ను ఎలకలు ఎత్తుకుపోవు లే!"

"ఎలకల కంటె పిల్లులే ప్రమాదం!"

## 2

భరతరావు యిరవై మూడేళ్ళవాడు. ఇంకా పెళ్ళీ పేరంటం కాలేదు. నలుగు రన్నదమ్ములలో యితను మూడో వాడు. కొడుకులు ప్రయోజకులు అయేదాకా చదువు చెప్పించడం తన విధి అనీ, ఆ పైన ఎవరికి నచ్చిన పిల్లని వారు కట్టుకుంటారనీ తండ్రి అభిప్రాయం. నిజానికన్నా-డా పెద్దబ్బాయి విషయంలో అంతే జరిగింది. డాక్టరీ పాసై, తన దగ్గిరే పనిచేస్తున్న నర్సుని పెళ్ళిచేసుకున్నాడు ఆయనగారు. ఎయిర్ఫోర్సులో జాయినయిన రెండో అతను, ముప్పయి ఏళ్ళయినా వచ్చేదాకా పెళ్ళేమిటి అని భీష్మించుకు కూచున్నాడు. మూడో వాడు సరేసరి—భరతరావు. భరతరావు తల్లి, "బెండకాయ ముదిరినా బ్రహ్మచారి ముదిరినా" అను లోకోక్తి డిప్టీ కలెక్టరుగారి దగ్గిర రోజుకి మూడుసార్లయినా వల్లిస్తూ వుండేది. "పెద్దవాడు కిరస్తానీదాన్ని కట్టుకున్నాడు; రెండోవాడు ఘోటక బ్రహ్మచారిలా కూచున్నాడు; మూడో వాడికైనా కులమింటి పిల్లని ముచ్చటగా తెచ్చుకోవాలి" అని ఆమె అభిలాష. వియ్యపురాలి లాంఛనాలు పుచ్చుకో

కుండానే తన జీవితం కడతేరుతుం దేమోనని అప్పుడప్పుడు ఆమె వ్యాకులపడేది. నాలుగో కుంక యింకా స్కూలు ఫైనల్ ఏడుస్తున్నాడు.

ఇక ఆడపిల్లల సంగతి చూదామా అంటే, ఒక్క పెద్ద దాని పెళ్ళి కాబోలు వైభవంగా చేశారు. రెండోది కాలేజిలో చదువుతూ తుర్రున పారిపోయి, పెళ్ళిచేసుకు చక్కా వచ్చింది. అందుకని మూడోదానికి కాలేజీ చదువు వద్దనీ, కాన్వెంటు చదువు చాలుననీ యిప్పట్నుంచీ భర్తచెవిని యిల్లు కట్టుకు పోరడం మొదలెట్టింది ఆమెగారు.

భరతరావు సెక్రటేరియట్‌లో ఉద్యోగం వెలిగిస్తున్నాడని తెలిసినమీదట, అత్తాడబడుచుల పోరు వుండదు గదా అని అయినింటి సంబంధాలు నాలుగైదు వచ్చాయి. అందులోవే ఒక్కటీ డిప్టీకలెక్టరుగారి భార్యకి నచ్చలేదు. కానీ బెండకాయ ముదిరినా బ్రహ్మచారి ముదిరినా అని ఆమె వల్లెవేసుకుని, కాకినాడ సంబంధం చూసి వచ్చింది. ఏదో కాస్త కట్నం, కొద్దిగా లాంఛనాలు. కాస్త అంటే—నాలుగువేలు కట్నం. కొద్దిపాటి లాంఛనాలు అంటే రెండువేలు లాంఛనాలు. డిప్టీ కలెక్టరుగారి భార్యామణి కళ్ళకి పిల్ల కూడా ఫరవాలేదనిపించింది.

తక్షణం డిప్టీ కలెక్టరుగారు కొడుక్కి ఉత్తరం రాశారు: "ఫలానా సంబంధం మీ అమ్మ చూసింది కాబట్టి, ఆమెక్కి అన్నివిధాలా నచ్చింది కాబట్టి, నువ్వు వచ్చి పెళ్ళికూతురుని

చూసుకోవలెను.'' ఈ వుత్తరం వచ్చే వేళకి భరతరావు చిన్న పద్మ వ్యూహంలో యిరుక్కుని వున్నాడు. అదేమంత పెద్దది కాదు; కాని ప్రమాదకరమయినదే. రేపు నాటక మనగా సెక్రటరీకి తను ఏభై రూపాయలు అప్పిచ్చాడు, ఇరవై అయిదు రూపాయలు మీనాక్షికి ఇవ్వాలనీ, ఇరవై అయిదు రూపాయలు యేదో అర్జంటుగా కావాలనీ పుచ్చుకున్నాడు అతను నాటకం అయి వారం రోజులయిందిగానీ ఈ పూటా ఆ పూటా అంటూ జాప్యం చేస్తున్నాడు సెక్రటరీ. తను యింటి అద్దె యివ్వలేదు; హోటల్ కివ్వాలి— టికెట్లు పుస్తకం యింక రెండు రోజులే వస్తుంది. ఫలానా ఆయన కొడుకు గదా అని నరసింహంగారు భరతరావుకి ఆ గది యిచ్చాడు. అలాంటి గది 18 రూపాయలకి దొరకడం అదృష్టం. ప్రతి నెలా 2 వ తేదీకి తను అద్దె యిచ్చేసేవాడు. యివ్వాళప్పుడే పది. ఏక్షణాన నరసింహంగారు నిలవదీసి అడుగుతాడో నని భరతరావు గుండె బితుకు బితుకు మంటూ వుంది. బట్టలేసుకు ఆఫీసుకి వెళ్ళబోతూ వుంటే నరసింహంగారు "నాయనా!'' అని పిలిచారు.

"ఆఁ'' అన్నాడు భరతరావు బెదురుతో.

"అద్దె యిచ్చావు కాదు. సాయంత్రమయినా చూడు. కొద్దిపాటి అవసరం ఉంది.''

నరసింహంగారికి ఈ 18 రూపాయలతో అవసరం ఎంత మాత్రం ఉండదని భరతరావుకి తెలుసు. తటపటాయిస్తూ నిలబడ్డాడు.

"ఏదో చెబుదా మనుకుని సంశయిస్తున్నావేమిటి? చెప్పు."

"ఏమీ లేదు; రెండో తారీఖున సినీమాకి వెళ్ళివస్తూండగా పర్సు పోయింది."

"ఎంతపని జరిగింది! ఎంతపని జరిగింది! ఇన్నాళ్లూ చెప్పనే లేదేం! ఆ తండ్రి కొడుకునని అనిపించుకున్నావ్. మీ నాన్నా యింతే. మనసులో మాట అరిచి గీపెట్టినా చెప్పేవాడు కాదు. పోలీసు కంప్లయింట్ యిచ్చావా? అదో దండగ లే! పోయిన వస్తువు లెక్కడో నూటికీ కోటికీ దొరుకుతాయి. అయితే, నెలాఖరిదాకా దమ్మిడీ లేదన్న మాట చేతిలో. నేను పరాయివాణ్ణిటోయ్—అడిగేదాకా చెప్పకుండా దాచేందుకు...ఉండు" అంటూ నరసింహంగారు లోపలికి వెళ్ళి ఏభై రూపాయలు పట్టుకొచ్చి యిచ్చాడు భరతరావుకి.

భరతరావుకి జ్ఞాననేత్రం తెరుచుకున్నట్టయింది. దీన్ని ఎందుకు మాయామేయ జగ మన్నారో యిట్టే అర్థమయింది. తను హరిశ్చంద్ర పాత్ర వెయ్యడంవల్ల ఒక విచిత్ర సత్యం తెలుసుకున్నాడు. దాగుడుమూత ఆడదలుచుకున్నవాడికి వక్రమార్గ మెలా లాభదాయక మో అనుభవపూర్వకంగా తెలుసుకున్నాడు. ఇది ఎవరికీ చెప్పకూడని, చెప్పరాని విచిత్రావస్థ.

"పది రూపాయల కంటె ఎక్కువ ఎప్పుడూ జేబులో వుంచుకోకు, నాయనా!" అని నరసింహంగారు చెబుతున్న

హితవు శ్రద్ధతో వింటున్నట్టు నటిస్తూ, వీధిమెట్లు దిగుతూ వుండగా పెళ్ళివార్త వున్న వుత్తరం పోస్ట్‌మాన్ అందిచ్చాడు. అది చదువుకుంటూ పది అడుగులు ముందుకు వేసే టప్పటికి మీనాక్షి తల్లి ఎదురయింది.

''మీ దగ్గిరికే వస్తున్నాను'' అంది మీనాక్షి తల్లి.

భరతరావు కాళ్ళు వొణికాయి. లేచిన వేళావిశేషం మంచిది కనక ఈవిడ వీధిలో తటస్థపడింది. నరసింహంగారు గనక ఈమెని చూసివుంటే ఆరాలుతీసి, తన ప్రాణం తోడేసి వుండును.

''ఎందుకు ?'' అన్నాడు భరతరావు ముక్తసరిగా.

''యివ్వాళ దాని పుట్టిన పండగ. సాయంత్రం కాఫీకి మీరు మా యింటికి దయచెయ్యాలి''

''సాయంత్రం సినీమాకి వెళ్దామనుకున్నానే! ఇంకో అప్పుడు ఎప్పుడైనా వస్తాను. ఇవ్వాళ పడదు.''

''అలా అంటే ఎలా ? మీ రెలాగో తీరిక చేసుకురండి. అదే వచ్చి పిలుద్దా మనుకుంది మిమ్మల్ని. కాని సిగ్గుపడింది. మీరు రాకపోతే అది ఎంతో చిన్నబుచ్చుకుంటుంది.''

నరసింహంగారు యిటువైపే నడిచివస్తున్నట్టు తోచింది భరతరావుకి. ''సరే'' అని ఆమెకి మాటయిచ్చి, గబగబా సెక్రటేరియట్ వైపుకి సాగాడు. ఆ వస్తున్నది నరసింహం గారు కాదు. ఆయనని పోలిన మనిషి. కాని భరతరావుకి ఆ సంగతి తెలీదు. సాయంత్రం గదికి వచ్చేదాకా అతని మనసు ఆందోళన పడుతూనే వుంది.

గదిలో కూచుని ఒక అరగంట ఆలోచించాడు వెళ్ళడమూ, మానడమూ అని. ఈ అరగంటే అనేమిటి? ఉదయం పదకొండు గంటలనుంచీ యిటో అటో తేల్చుకోలేక మధన పడుతూనే వున్నాడు అరగంట ఘట్టిగా ఆలోచించి వెళ్ళకూడదని నిశ్చయించుకున్న మీదట, ఒక భయం పొడసూపింది. ఏ ఎనిమిది గంటలకో మీనాక్షీ తల్లి తనకోసం మళ్ళీ వస్తే? తనప్పుడు హోటల్లో భోజనం చంజుతూ ఉంటాడు. ఇక్కడ నరసింహాంగారు చుట్టగాలుస్తూ వీధి అరుగుమీద కూచుని, ఆమె వద్దనుంచి తెలుసుకోదగినదంతా తెలుసుకుంటాడు. ఆ పైన యింకేముంది—కొంప లంటుకుంటాయి. "ఒక్కసారి వెళ్ళివస్తే, ఈ పీడ యిక్కడితో వొదులుతుం దేమో!"—అనుకున్నాడు.

భరతరావుకి మీనాక్షిని చూడాలని అంతరాంతరంలో లేకపోలేదు. ఆమె బురదలోంచి జనించిన పద్మం అయితే కావచ్చు; కాని ఆ బురద తన పాదాలకి తగలడం కూడా భరతరావుకి యిష్టంలేదు. మీనాక్షిని చూడాలనే వెళ్తున్నాడో, మీనాక్షి తల్లికి భయపడే వెళ్తున్నాడో భరతరావుకి తెలియదు.

ఏమయితే నేం వెళ్ళాడు. వారిదో చిన్నయిల్లు. ఉన్నదానిలో జాగ్రత్తగా అమర్చారు. మొగ వకుత ఉన్నట్టు అతనికి కనిపించలేదు. వాళ్ళు పెట్టిన మైసూర్ పాక్ కొరికి, కారబ్బూంది తిన్నాడు. మీనాక్షి గులాబీరంగు వెంకటగిరి జరీచీరె కట్టుకు, తెల్ల జాకెటు వేసుకుంది. కళ్ళకి కాటుక

పెట్టుకుంది. తలంటి పోసుకున్న జుట్టులో వత్తుగా జాజులు పెట్టుకుంది. వాళ్ళ వాటా అంతా కలిపి మూడు గదులు మొదటి గదిలో రెండే రెండు కుర్చీలు వున్నాయి. ఒక దాంట్లో భరతరావు కూచున్నాడు. తల్లీకూతుళ్ళు చాపమీద కూచున్నారు. భరతరావు కాఫీగ్లాసు పుచ్చుకోగానే మీనాక్షి తమలపాకు యీనెలు చీల్చడం మొదలెట్టింది.

ఏదో బీదవాళ్ళం, బాబూ! అది మిమ్మల్ని పిలవాలని మూడు రోజులబట్టీ పలవరిస్తోంది. మీ రేమనుకుంటారో అని నాకూ దుడుకుగానే వుంది. అయినా, ధైర్యంచేసి బయలు దేరాను. మా ముద్దు చెల్లించారు. అదే పదివేలు'' అంది మీనాక్షి తల్లి. మీనాక్షి తల వొంచుకు తమలపాకులు చీలుస్తూనే వుంది.

స్టేజిమీద అంత మీదమీదకి వచ్చిన మీనాక్షి, మేక పిల్లలా, యింతటి మృదుత్వంతో మసలడం భరతరావుకి క్రొత్తగా తోచింది!

ఏదో మాట్లాడాలి గనక భరతరావు అన్నాడు! ''ఆడంగుల వయస్సు అడగకూడదని అంటారు గాని యిది యెన్నో పుట్టిన పండగ మీనాక్షికి?'' తను కష్టపడి ఫ్రేమ్ చేసిన వాక్యం వంకరటింకరగా వుందేమోనని, అనేసిన తర్వాత తటపటాయించాడు.

''పదిహేడూ వెళ్ళి పద్దెనిమిది వచ్చాయి. వయస్సు దాచుకోడ మెందుకు, బాబూ! పధ్నాలుగో యేటబట్టీ నాటకాలలో వేస్తోంది. మారోజు లిలా తప్పి వచ్చాయి.

పొట్టకూటికి ఏదో ఒక వృత్తి కావాలిగదా! నలుగురూ ఏమనుకుంటేనేం—మన మనసు మనకి సాక్షి''

''అంతే'' అన్నాడు భరతరావు, కన్నీటి కావ్యాన్ని అంకిత మందుకునే కృతిభర్తలా.

మీనాక్షి తండ్రి ఒకప్పుడు బాగా బతికినవాడే. మీనాక్షికి ఎనిమిదేళ్ళు వచ్చేదాకా అతను జీవించే వున్నాడు. యింకా మూడేళ్ళకి చచ్చిపోతాడనగా అతనికి పక్షవాతం వచ్చింది. ఉన్న నాలుగెకరాలూ అన్యాక్రాంత మయింది. ఆ మూడేళ్ళూ మీనాక్షి తల్లి పడరాని పాట్లుపడి కుటుంబాన్ని పోషించింది. ఆయన మాత్రం చనిపోయేదాకా ఒక్క మాట అనేవాడు కాదు—దేవుడి లాంటివాడు.

పువ్వు లమ్మిన వూళ్ళో కట్టెలు ఎలానూ అమ్మరు; కాని, తిరిగీ అక్కడ పువ్వులు అమ్మగలగడం కల్ల. మీనాక్షి మేనమామ అప్పుడు పట్నంలో వుండేవాడు. నెమ్మదిగా అతని పంచని జేరుకున్నారు. అతను నాటకాల్లో వేషాలు వేస్తూ వుండేవాడు. గుణ మనేది వ్యక్తినిబట్టి నిర్ణయ మవుతుందిగాని వృత్తినిబట్టి గాదు—అనేవా డతను. అతను మూడేళ్ళక్రితం హృద్రోగంవల్ల చనిపోయాడు. అతను బతికుండగానే మీనాక్షిని చాలా పాత్రలకి తర్ఫీదు చేశాడు. ఉచ్చారణ బావుంటుంది కాబట్టి మీనాక్షి నటనని చాలా మంది మెచ్చుకుంటారు.

''ఇంతకీ యిదంతా భుక్తికోసం. ఒక అయ్యచేతిలో దానిని పెట్టగలిగితినా, నాకు సుఖంగా నిద్రపడుతుంది.''

"మీ యింట్లో దోమలు ఎక్కువగా వున్నాయా?" అని ఒక జోక్ విసురుదా మనుకున్నాడు కాని తన తెలివికి తానే సంతోషించి నోరు మూసుకున్నాడు భరతరావు.

"అమ్మో! తొమ్మిదయిందే!" అంది మీనాక్షి చంటి పిల్లలా.

"సినీమాకి, శాబూ!" అంది మీనాక్షి తల్లి.

సినీమాలో మీనాక్షి తనపక్కన కూచోవందుకు కాస్త కించపడ్డాడు భరతరావు. అతని పక్కసీట్లో తల్లి కూచుంది; తల్లి తర్వాత మీనాక్షి కూచుంది. మీనాక్షి పైకి చూపు తున్న ముఖభావనకి వెనక మహా సంగీతం ఉందిగాని భరత రావుకి తెలియదు.

# 3

"చెప్పకుండా రెండో ఆట సినీమాకి వెళ్ళావేమి?" అని నరసింహంగారు ఉదయం అడుగుతారేమోనని, భరతరావు రాత్రి గదిలోకి వచ్చి పక్కమీద పడుకున్న తర్వాత ఒక అరగంటసేపు పస్తాయించాడు. ఏమయినా, అతని బుర్ర యావత్తూ నానాగందరగోళంగానూ ఉంది. కొండ గుహ లోకి తను చొరుచుకొని పోతున్నట్టు ఉంది. రైలు టనెల్ లో ప్రవేశించినమీదట, దీపాలు వెయ్యకపోతే ఎలా ఉంటుందో, అతని మన స్థితి ఆమాదిరిగా ఉంది.

ఏడు కొట్టక పూర్వమే సూదుల్లాటి సూర్యకిరణాలు భరతరావుని తట్టి లేపాయి. లోక మతనికి నిత్య నూత

సంగా కనిపించలేదు—సరిగదా, మందకొడిగా ఉంది. తండ్రికి పెళ్ళికూతురు విషయమై జవాబు రాయాలి. నరసింహం గారు గనక అడిగితే, అతికే అబద్ధం చెప్పాలి. మంచో చెడ్డో, అయిం దయిపోయింది. ఈ మీనాక్షి ప్రమాదం నుంచి తను తేరుకోవాలి. నిన్న నొక్క కాయితం ముట్ట లేదు : ఆఫీసులో చచ్చేటంత పని ఉంది; అందుకని తొందరగా తను తెమలాలి.

స్నానాదికాలు ఐన తర్వాత కార్యక్రమం ఐటమ్‌వారీ పరిశీలన చెయ్యసాగాడు. నాలుగువేల రూపాయిల కట్నం; రెండువేల రూపాయిల లాంఛనాలు. ఆదర్శ వాదాన్ని అనుసరించి చూడదలుచుకుంటే, తను వరశుల్కానికి వ్యతిరేకుడు. ఒక ప్రాంతాల కన్యల్ని అమ్ముతే, మరొక ప్రాంతాల వరుల్ని అమ్ముతున్నారు. ఈ దేశంలో, ఏమయినా సరే, కట్నం పుచ్చుకోవడ మనేది నీచం. నాలుగువేలు పెట్టి ఆ అమ్మాయి తనను కొనుక్కుం టోందన్న మాట. లాంఛనమనీ, ఆచారమనీ బురఖా తగి లించుకున్నప్పటికీ నిజానికి వస్తు విక్రయమేగా యిదంతా! ఆ పిల్ల తనను ఎంత పోసి వాళ్ళవాళ్ళు కొన్నదీ సర్వకాలాలా చెప్తూనే ఉంటుంది.

నాలుగువేలు కట్నం బాగానే ఉంది. ధరల గిరాకీవల్ల పెళ్ళికొడుకుల రేటు కూడా పెరిగిన మాట వాస్తవమే. మద్రాస్‌లో తను వెలగబెడుతున్న ఉద్యోగం చూసికాదు. వాళ్ళు ఈ డబ్బుపోసేది! తన తండ్రి డిప్టీకలెక్టరు గనక

తన వెల జాస్తీ అయింది. వరశుల్క పిశాచాన్ని ఆదర్శ వాద ప్రకారం హతమార్చవలసిందే!

కాని, యిరవైమూడేళ్ళ యువకుడు. నాలుగువేల రూపా యిలు ఒక్కసారి కళ్ళచూసే అవకాశాన్ని చేజేతులా జార విడుచుకుంటాడా? అది సర్వాబద్ధం. సమస్త ఆదర్శాలూ ఆర్థిక వాదానికి బానిసలై నిలుస్తాయి. నాలుగువేల రూపా యల నోట్లు భరతరావు కళ్ళముందు తళతళ మెరిశాయి. కాని, తండ్రి ఆ రొఖ్ఖం తన చేతుల్లో పోస్తాడా? తల్లి పోయనిస్తుందా? నా డబ్బు నా కివ్వండని తను ఏ నోరు పెట్టుకు అడుగుతాడు? ఒకవేళ నోరుజాచి అడిగితే మాత్రం. "కుర్రనాగమ్మ వాడి కేం తెలుసు!" అని తన మాట కొట్టేసి, ఆ అమ్మాయికి ఏ రవ్వల అడ్డిగో చేయించి వూరు కుంటారు. ఇదంతా ఒక న్యూసెన్సు. తను ఆదర్శం మంట గలుపుకు రాజీపడ్డా, ప్రయోజనం ఉండదు-సరిగదా, ఈ నూటపది రూపాయిలతోనూ మరొక ప్రాణిని పోషిస్తూ, ఎల్ల కాలమూ గుమాస్తాలా పడివుండవలసివస్తుంది. పెళ్ళి అయి పోయిన తర్వాత యింక స్వేచ్ఛ ఏమిటి?

ఏదో నిక్షేపంగా కాలం గడుస్తూ వుండగా మెడకి ఒక గుదిబండ కట్టుకు, ఆపైన లోకంమీద క్రోధం ప్రకటించడ మెందుకు? తను పెళ్ళికోసం మొహం వాచివుండలేదు. సినీ మాలతో, స్నేహితులతో, ఆఫీసు వర్కుతో రోజులు చక్కగా దొర్లిపోతున్నాయి. "ఇలాగే మరికొంతకాలం గడవనీ!" అనుకున్నాడు భరతరావు.

"నాన్నగారికి : కట్నమంటే నాకు యిష్టంలేదని మీకు తెలుసు. నా ప్రస్తుత సంపాదన కూడా మీకు తెలుసు. పద్దెనిమిది నెలల్లో నాకు పైగ్రేడు రావచ్చు. అంతవరకూ వివాహ ప్రసక్తి ఎత్తవద్దని ప్రార్థన. అమ్మకి నమస్కార ములు."

ఉత్తరం గిలికి, కవర్లో పెట్టి, అడ్రసు రాసి, స్టాంపు అంటించి, జేబులో పెట్టుకున్నాడు. ఈ విషయం సావధానంగా ఆలోచించినమీదట. మిగతా పేచీ ఆలోచించ గలిగే శక్తి లేకపోయింది. నరసింహంగారి కేదో చెప్ప వచ్చు. మీనాక్షి సంగతా? ఆమె తల్లిపేర తన గది వద్దను, ఎప్పుడూ, ఏ సందర్భంలోనూ రావద్దని ఒక ఉత్తరం ముక్క రాసి పడేస్తే సరి! తను భయస్తుడనీ, మర్యాద తెలియనివాడనీ వాళ్ళు అనుకుంటారా? అవును—తను భయస్తుడే—తప్పేముంది! మాంసం తింటున్నామని ఎము కలు మెళ్ళో వేసుకు తిరుగుతారా? రెండణాల స్టాంపు మరొకటి డెయిరీలో ఉండటంవల్ల ఆ ఉత్తరం కూడా వెంటనే రాయాలనిపించింది. మీనాక్షి ఏమయినా అనుకుంటుందా? తనమీద నిజంగా గౌరవం వుంటే అనుకోవలసిం దేమీ లేదు. అల్లరి పడకుండా ఒక మార్గం చెబుతున్నాడు తను— అంతే.

తను వుంటున్న యింటివారు శుద్ధ శ్రోత్రియులూ, అను మానగ్రస్తులూ అయివుండటంవల్ల, ఏ సందర్భంలోనూ యింటికి రావద్దనీ, తనకి తెలియబరచవలసిన విషయమేదైనా

ఉంటే. కార్డుగాక కవరుద్వారా తెలియపర్చమనీ రాసి, ఆ రాసిన ఉత్తరం చించేసి, మళ్ళీ రాయడం మొదలెట్టాడు. ఈసారి ధోరణి చెప్పబడటమే కాకుండా కమ్మదనం కూడా వచ్చిందక్కడక్కడ. తనను పిలిచినందుకు థాంక్ చేశాడు. మీనాక్షిని మరీమరీ అడిగానని చెప్పమన్నాడు. నరసింహం గారు ఆవిలిస్తే పేగులు లెక్కపెట్టే మనిషి గనక ఏ సంగతైనా ఉత్తరంద్వారా తెలియపర్చడం ఉత్తమ మన్నాడు. తను నాలుగైదు రోజులు పోయిన తర్వాత వస్తానన్నాడు. మీనాక్షి తల్లికి రాసిన జాబూ, డిప్టీకలెక్టరుగారికి రాసిన జాబూ రెండూ జేబులో పెట్టుకు వీధి వాకిట్లోకి వచ్చాడు. సావిట్లో తిష్టవేసే నరసింహంగారు కనిపించలేదు. "బ్రతుకు జీవుడా" అని చరచరా నాలు గడుగులువేసి, సందు చివర నున్న పోస్టు డబ్బాలో వుత్తరాలు పడేసి, హోటల్లో దబదబా నాలుగు మెతుకులు తిని, సెక్రటేరియట్ చేరుకున్నాడు.

భరతరావు తన టేబుల్ ముందు కూచుని, కాగితాలు సరిగా పేర్చుకున్నాడో లేదో, పొట్టిసెక్రటరీ వెనకగా వచ్చి, వీపు చరిచి, "ఇదిగో, బ్రదర్" అంటూ ఏభై రూపాయలూ చేతిలోపెట్టాడు. గంగలో కలిసిపోయిందనుకున్న డబ్బు వచ్చినందుకు భరతరావు మొహం విప్పారింది.

"ఒక్కసారి వరండాలోకి వస్తారా?" అన్నాడు. సెక్రటరీ.

డబ్బు జేబులో పెట్టుకుంటూ సెక్రటరీ వెంట భరతరావు వరాండాలోకి నడిచాడు.

"చూడండి—మీ మేలుకోరి చెబుతున్నా. నేను మీకు చెప్పదగ్గవాడిని కాననుకోండి. ఆ మీనాక్షి ముండ యింటికి ఎందుకు వెళ్ళారు, సార్! అది ఎన్నికొంపలు మాపేసిందో మీకు తెలియదు. మా పిల్లదాన్ని భరతరావుగారు పెళ్ళాడుతా నన్నారంటుంది—చూడండి, మీకు సంఘ సంస్కరణ చెయ్యాలనివుంటే వితంతు విద్యాలయానికో, అనాధ శరణాలయానికోపోయి. ఒక చూడ చక్కనిదాన్ని ఏరి, తెచ్చుకు, పెళ్ళిచేసుకోండి. అంతేగాని మీ కీపని తగదు, సార్."

సెక్రటరీ వేసవికాలంలో దబ దబా పడే చినుకులులా చెప్పుకుపోయాడు. ఆ పది చినుకులతోను భరతరావు తల మట్టుకు తడిసింది.

"అలాంటి అభిప్రాయ మేమీ నాకు లేదే!"

"మీ రసలు దాని యింటికి ఎందుకు వెళ్ళాలి చెప్పండి. అడుసులో పాదం పెట్టనేల?" అని నిలవదీశాడు సెక్రటరీ.

ఉన్న రహస్య మేమిటంటే! సెక్రటరీ మీనాక్షిమీద ఒక కన్ను వేసి వుంచాడు. కన్ను వెయ్యడ మంటే ఆమెమీద నిఘా వుంచాడనిగానీ, కాపలా పెట్టాడనిగానీ కాదు అందులోని అర్థం. తను చచ్చి చెడి నాటకంలో బుక్ చెయ్యడ మేమిటి, పుట్టిన పండగంటూ భరతరావుని పిలిచి మేపడ మేమిటని కించపడ్డాడు. ఆ పిలిచే దేదో తననే పిలవక భరతరావుని ఎందుకు పిలవాలి? సెక్రటరీ ఆఫీసు కొస్తూ, ఒక్కసారి మీనాక్షి గుమ్మంలోకి తొంగిచూదామని వెళ్ళగా, మీనాక్షి తల్లి, ఆమె నోటితోటే, భరతరావుని

తను పిలిచిన సంగతీ, తాము ముగ్గురూ సినిమాకి వెళ్ళిన సంగతీ చెప్పింది. మీనాక్షి తనకేమీ వారగ బెట్టకపోయినా భరతరావుమీద ఆ మాత్రపు ఆదరమైనా ఎందుకుచూపాలి?_ అని సెక్రటరీ ఉక్రోషం. అందుకని ఈ కథ అల్లి భరత రావుని బెదరగొట్ట చూశాడు.

భరతరావు కొంతవరకూ బెదిరినమాట నిజమే. ఎప్పు డయితే నలుగురితోటీ ఈమాట అనవద్దని భరతరావు నెమ్మదిగా తనతో చెప్పుకున్నాడో, అప్పుడే అర్థమయింది సెక్రటరీకి, తనమాత్ర పనిచేసిందని. భరతరావుకి పిలక లేదు కాబట్టి అతని జుట్టు తన చేతికి చిక్కిం దనుకున్నాడు.

ఎవరికీ ఈ వార్త చెప్పనని హామీ యిచ్చిన సెక్రటరీ, మర్నాటి సాయంత్రానికి నలుగు రైదుగురికి చెప్పేసినట్లు భరతరావుకి పొడగట్టింది. ఈ అపవాదుని ఎలా తప్పించ గలనా అని బాధపడసాగాడు. తోటి గుమాస్తా లందరికంటె ఆత్మీయుడైన ప్రకాశమ్ దగ్గిర ఈ ప్రసక్తి తీసుకురావడమా మానడమా అని సతమతపడి, ఏ నిర్ణయానికీ రాలేక, మూడోనాటి సాయంత్రం ప్రకాశమ్ బంగాళాకి వెళ్ళాడు.

భరతరావు గాలి తాకిడికి కొట్టుకుపోతున్నాడు. ఎండు టాకయినా, పండుటాకయినా గాలివీచిన విధంగా కొట్టుకు పోవలసిందే. గాలికి ఆకు అనగా ఎంత? ఆకు తనకు తానుగా గాలికి ఏదో మనవి చేసుకోగలనని అనుకోడం హాస్యాస్పదం కదూ? గాలిపాటున ఆకు ఒక చోటనుంచి ఎగిరి మరోక

చోట పడినట్టు, మనుషులు పరిస్థితుల తాకిడికి కప్పగంతులు వేస్తారు ఎగిరెగిరి పడుతూ కూడా ఏదో తాము కోరుకు ఎగిరినట్టు భావించుకుని, ఆత్మ సంతృప్తి పొందుతారు.

భరతరావు మీనాక్షి యికుకున పడిపోతున్నాడు. పడిపోకూడ దనుకుంటూనే పడిపోతున్నాడు. పడటం, పడక పోవడం అతని చేతులలో లేదు. పరిస్థితులు మనుష్యుల్ని ఒక అవస్థనుంచి మరో అవస్థకి త్రుంనతోస్తాయి. ఆ తోపిడిలో ఒకప్పుడు ఎక్కువదూరం వెళ్తాము; మరొకప్పుడు కొద్ది దూరమే వెళ్ళి కాస్త నిలుస్తాము. మనందరికి మల్లేనే భరతరావు కూడ బాటసారి, ఆ బాటసారిని ఒక కుటీరకన్య బృందావన గీతి ఆలాపిస్తూ పిలిచింది. ప్రతి బాటసారినీ కుటీర కన్యలు మధురాలాపంతో పిలుస్తారనే ఆత్మ చింతన వున్నవా డయితే, భరతరావు—ముందుదారి కనిపించినా, కనిపించకపోయినా, ఆకాశాన వున్న చుక్కల్ని నమ్ముకునైనా కారడివి ఛేదించి వుండును.

అతను బంగాళాకి వెళ్ళేటప్పటికి విశాళమూ, అరుణా దేవీ వారి స్వంతకోర్టులో టెన్నిస్ ఆడుకుంటున్నారు. భరతరావుని చూడగానే టెన్నిస్ రాకెట్ అతనికి వొప్పజెప్పి, విశాళమే అడయార్‌లో ఏదో మీటింగు వుందంటూ జారుకున్నాడు. ఆ పైన, చీకటి పడేదాకా అరుణాదేవీ, భరతరావూ టెన్నిస్ ఆడుతూనే వున్నారు. ఆట ఐపోయి, దక్షిణ దిక్కు పూలపందిర పక్కనున్న పేముకుర్చీల దగ్గిరకి వస్తూ వుండగా అరుణాదేవి అంది;

"ఏమండీ మిమ్మల్ని హరిశ్చంద్రుడూ అని పిలవాలని ఉంది."

"నే నంత సత్యసంధుణ్ణి కానుగా?"

"ఏమైనా కళాకారులు గదా?"

"అలా మాట్లాడుతున్నారేమి యివ్వాళ?"

"నటకావతంసులు!" అని చిలిపిగా నవ్వింది అరుణా దేవి.

"మీరు రాలేదేమి?"

"నేను నిజంగా రావాలనుకుంటే మీరు వచ్చి పిలుద్దురుగా!"

"వెధవ నాటకం. బెడద తీరిపోయింది. మీ పరీక్షి లెప్పట్నుంచి, అరుణా?"

"పై బుధవారంనుంచి." అరుణ క్వ్యా ఎమ్ సి లో థర్డ్ యియర్ చదువుతోంది.

బోయ్ తీసుకొచ్చిన ఐస్డ్ సోడాలు తాగిన పిమ్మట ఒకరు బంగాళాలోకి వెళ్తే, మరొకరు వీధిలోకి వచ్చారు.

# 4

ఆ రాత్రి నిద్దర పక్కమీద పడుకొని ఆలోచించగా ఆలోచింగా యిదంతా విశాళమ్‌కి విన్నవించడం అనవసర మని తోచింది భరతరావుకి. విశాళమ్ అరుణకి చెప్పక మానడు. ఆమె తనను చిన్నచూపు ఎందుకు చూడాలి?

మర్నాటి పొద్దుటి పోస్టులో బాంబ్ షెల్ లాంటి ఉత్తరం వచ్చింది. తల్లి రెండురోజులబట్టీ లేవటంలేదనీ, ఒక్కసారి వచ్చి చూసిపొమ్మనీ మీనాక్షి రాసింది. మనిషికి మల్లేనే ఆమె అక్షరాలుకూడా పొంకంగా ఉన్నాయి. ఆఫీసుకి వెళ్ళ డానికి పూర్వమే వారింటికి వెళ్ళాడు భరతరావు.

గుమ్మంలోనే మీనాక్షి ఎదురై లోపలికి తీసుకువెళ్ళింది. మీనాక్షి తల్లి పేముమంచంమీద పడుకునిఉంది. ఎవరో దగ్గర్లోవున్న డాక్టరు వైద్యం చేస్తున్నాడు. గుణం కనిపించ డంలేదు. రాత్రంతా వెన్నులో పోట్లని నిద్దరపోలేదు. భరత రావుని చూసి ఆమె ఒకసారి కళ్ళు తెరిచి, మళ్ళీ కళ్ళు మూసుకుంది. ఒకటే మగత.

"మాకు మొగదక్షత లేదు. ఇప్పుడు ఏంచెయ్యాలో తెలీదు. నా పాలిట ఒక యముడున్నాడు, వాడినుంచి ఎలా తప్పించుకోవాలో తోచడంలేదు. అమ్మ జబ్బుకంటె నాకు వాడిభయం ఎక్కువవుతోంది. అందుకనే తెగించి మీకు జాబు రాశాను." అంది మీనాక్షి.

"ఎవరతను ?" అని అడిగాడు భరతరావు.

"ఎవరో బిందు మాధవరావట. ఏదో జమీకూడా కగలడ్డదట. ఉడతలు పట్టేవాడిలా ఉంటాడు. నన్ను నాలుగు నెలల క్రితం ఎక్కడో చూశాడట—అప్పట్నుంచీ ఇంటిమీదకి కునుకు రావడంలేదట. నేను కనికరించాలట."

భరతరావుకి ఈ కథ వినడం అసహ్యంగా వుందని మీనాక్షి గ్రహించి అంది.

"నన్ను చూస్తే మీకు అసహ్యం వెయ్యవచ్చు. కాని చెప్పకునేందుకు వేరే దిక్కు లేక మీకు చెప్పకుంటున్నాను. సాయం చెయ్యగలిగితే మీ రొక్కరే చెయ్యగలరు! లేదా- నా ఖర్మ నే ననుభవిస్తాను."

"ఆ బిందు మాధవరావుమీద నీ కంత కోపం ఎందుకు? నేను చెయ్యగలిగిన సాయం ఏమిటి?" అని ప్రశ్నించాడు భరతరావు.

"బిందు మాధవరావు మా అమ్మనీ, నన్నూ తన బంగాళాకి తర్లించుకుపోదామని చూస్తున్నాడు. అతనికి భార్యా, యిద్దరు పిల్లలూ ఉన్నారు. భార్య కాక సుజాత అను యింకో అమ్మాయి ఉంది ఆయనకి. ఆ సుజాతకూడా వారి బంగాళాలోనే ఒక భాగంలో ఉంటుంది. ఇంకో భాగంలో నన్ను కూడా పెట్టాలని ఆయన ప్లాను. నాకు ఆ ఏర్పాటు యిష్టం లేదు."

"మీ అమ్మకో?"

"అమ్మకి అసలు యిష్టంలేదు. కాని ఆయన చతురుడూ సంపన్నుడూ అయివుండటంవల్ల మొహంమీద ఏ మాటా అనలేకుండా వున్నాము. మీనాక్షి పేరుమీదుగా నాటక సమాజం స్థాపిస్తా నంటాడు. అమ్మకి ఈ పెద్దఎత్తులు యిష్టం లేదు."

మీనా...మీనా...అని మూలుగుతూ తల్లి పిలిచింది యింతలో, ఆమెకి కాసిని మంచినీళ్ళు యిచ్చి, తను చాప

మీద చతికిలబడి, కుర్చీమీద కూచున్న భరతరావుకి కథ చెప్పడం మొదలెట్టింది మీనాక్షి.

"నాకు దిక్కుతోచకుండా ఉంది. అమ్మకి ఎప్పటికి నయమవుతుందో తెలియడంలేదు. ఇవ్వాళ మంగళవారమా, రేపు శనివారం తిరుపతిలో నాటకం ఉంది. ఏభై రూపాయలిస్తారు. ఇంట్లో డబ్బు విషయమూ అంతంతగానే ఉంది. మీకు బాధ కలిగిస్తున్నానా నా కష్టాలు చెప్పుకుని?"

"మనుషులమై పుట్టినతర్వాత ఒకరి బాధలు యింకొకరు వినే వోపికకూడా లేకపోతే మానవత్వమేమిటి? అది కాదు నేను ఆలోచిస్తున్నది—నేను ఎలా సాయపడగలనా అని ఆలోచిస్తున్నాను. బిందు మాధవరావుగారు ఎప్పుడు వస్తారు?"

"సాయంత్రం వేళ."

"నేను ఏమని చెప్పాలి ఆయనకి?"

"మీరు ఏమీ చెప్పనక్కర్లేదు. ఆయనతో నేనే మాట్లాడుతాను. మీరు యింట్లో నా పక్కన వుంటే చాలు."

"నేను మాత్రం మంచివాణ్నా? నన్నెందుకు నమ్ముతావు?" అని కొంటె ప్రశ్న వేశాడు భరతరావు.

"మనిద్దరిలోనూ నాకంటె మీరే మంచివారు"

"నీ కెలా తెలుసు?"

"మీ పుట్టు పూర్వోత్తరాలన్నీ అమ్మ నాకెప్పుడో చెప్పింది."

"అమ్మ కెలా తెలుసు?"

"మీ సెక్రటరీ చెప్పాడుట. ఆయన యిక్కడికి రెండు వీధులు పైనేగా ఉంటున్నది."

"అప్పుడప్పుడు యిక్కడికి వస్తూవుంటాడా?"

"వారానికి ఒక సారయినా వచ్చి అటెండెన్సు వేయించుకుపోతూ వుంటాడు. మనం సినిమాకి వెళ్ళిన మర్నాడు వచ్చాడు. అమ్మ కొన్ని విషయాలలో వెర్రిబాగులది. మిమ్మల్ని తను ప్రత్యేకంగా పిలిచినట్టూ, మనం ముగ్గురం సినిమాకి వెళ్ళినట్టూ అంతా పూసగుచ్చినట్టు చెప్పేసింది. భరతరావులాటి అల్లుడు దొరికితే నా కష్టాలు తీరిపోతాయి—అంటి ఆయనతో. ఆ మాట ఆయనతో అనకూడదని అమ్మకి తెలీదు."

"ఎందు కనగూడదేమిటి?" అని ఎదురుతిరిగి అడిగాడు భరతరావు.

"సెక్రటరీకి చక్కటి చుక్కలాటి పెళ్ళాం ఉంది. లా వొప్పదు గనక గాని లేకపోతే నన్నుకూడా పెళ్ళిచేసుకుని వుండునట. పెళ్ళి చేసుకోనంత మాత్రాన...అని తేభ్యంలా మొహం పెట్టి చూసేవాడు...అసహ్యమేస్తూంది కదూ నా కథ వింటూంటే..."

"అసహ్య మెందుకు?"

"నాకు తెలుసు—మీకు అసహ్యమేస్తూంది. అయినప్పటికీ నన్ను గురించి నేను చెప్పుకోవలసిన బాధ్యత ఉంది.

మీ నుంచి గొప్పసాయం ఆపేక్షిస్తున్నప్పుడు, ఆ సాయం పొందేందుకు నేను అర్హురాలినో కానో నిర్ణయించుకోగల సావకాశం మీ కివ్వడం నా ధర్మం. మీరు అవివాహితులు, యువకులు, ఉత్తమకుటుంబీకులు. నావల్ల మీకు చెడ్డ పేరు రాకూడదు'' అనేసి, యింక చెప్పేదేమీ లేదన్నట్టు తల దించేసుకు మౌనముద్రలోకి వెళ్ళిపోయింది మీనాక్షి.

ఆమె చెప్పిన ఆఖరుమాట అబద్ధం. భరతరావుకి చెడ్డ పేరు రాక మంచిపేరు వస్తుందా—ఏది మంచి, ఏది చెడ్డ అని ప్రశ్నిస్తే చెప్పలేముగాని, భరతరావు మనసు కదిలింది. అతని హృదయాకాశంలో ప్రత్యూష పవనాలు వీచాయి.

రోజూ రాత్రి 10 గంటల దాకా మీనాక్షి యింట్లోనే వుండేవాడు. భోజనం మాత్రం హోటల్‌లో చేస్తూవుండే వాడు. ఉదయం ఏడున్నర అయేవేళకి వచ్చి, ఆఫీసు టైము దాకా కూచునేవాడు. ఆఫీసు అయిపోయిన తర్వాత, గదికి వెళ్ళి బట్టలు మార్చుకు, మళ్ళీ వచ్చి కూచునేవాడు. ఇలా మూడురోజులే జరిగింది. మంగళవారం, బుధవారం, లక్ష్మి వారం. లక్ష్మివారం మీనాక్షి తల్లికి జావ యిచ్చారు; డాక్టరామెకి శుక్రవారం పత్యం పెట్టవచ్చునన్నాడు. ఈ మూడు రోజుల్లోనూ పొగమంచులా చుట్టేసింది .మీనాక్షి భరత రావుని. బిందు మాధవరావూ రాలేదు, సెక్రటరీ రాలేదు— తోక ముడిచారో ఏమో!

శుక్రవారం ఉదయం మీనాక్షి తల్లి భరతరావుతో సంప్రతించింది; ''ఏం బాబూ, అమ్మాయితో నేను ఈ

రాత్రి తిరుపతి వెళ్ళడం మంచిదంటారా ? పత్యం మెతుకులు పడ్డాక కాస్త త్రాణవస్తుంది కానీ వ్యాధి మళ్ళీ తిరగబెడు తుందేమోనని భయంగా ఉంది.”

ఆ సూచనలోని అంతరార్థం భరతరావుకి అర్థమయింది. భరతరావు మీనాక్షిని వెంటబెట్టుకు తిరుపతి వెళ్ళడానికి అంగీకరించాడు. సాయంత్రం వస్తున్నప్పుడు తనవి రెండు జతల బట్టలు తెచ్చుకున్నాడు. అక్కడ చదువుకునేందుకు రెండు పుస్తకాలు కూడా తెచ్చుకున్నాడు.

ఆ రాత్రి మీనాక్షే వంటచేసింది. భరతరావుకి అదే మొదటిసారి వారింట్లో భోజనం చెయ్యడం. గుమ్మందగ్గిర మీనాక్షి తల్లి కూచుంది. వసారాలో పీటవేసి అరిటాకులో బంగాళదుంపల వేపుడూ, సెనగపప్పు పచ్చడీ, మల్లెపువ్వు ల్లాంటి అన్నమూ వడ్డించి, భరతరావుని పిలిచింది మీనాక్షి. అతను పీటమీద కూచుని, “సి కేది ?” అన్నాడు.

“మీారు తిన్నతర్వాత ?”

“అలా కాదు. నువ్వుకూడా పెట్టుకో, మీరు చెప్పండి” అన్నాడు భరతరావు మీనాక్షి తల్లిని వుద్దేశిస్తూ.

“ఇవ్వాళ వూరుకోండి. నాకు సిగ్గేస్తుంది. మీరు తిన్న తర్వాత పెట్టుకుంటాను. అప్పుడు మీరు నాకు సాయం కూచుంటురు గాని.”

సిరసంవల్ల తలుపుకి జేరగిలబడి కూచున్న మీనాక్షి తల్లి నేత్రాలు చెమర్చాయి. తన పని తీరిపోయిందనుకుంది.

భరతరావు విచిత్రలోకంలో విహరిస్తున్నాడు. ఎవరీ మీనాక్షి ? ఆమె తనకి వండిపెట్టడమేమిటి—తను తినడమేమిటి ? ఈ ప్రయాణం ఎక్కడికి—ఏ అవధికి ?

భరతరావు మెదడుకి పని చెప్పదలచుకోలేదు. ఇది పరిమళ జగత్తు. మీనాక్షి తలలోని జాజులొక్కటే కాదు పరిమళాన్నిస్తున్నది. లోకమే సుగంధమయంలా ఉంది. యవ్వనం వారిద్దరికీ కర్పూర నివాళు లర్పిస్తూంది.

తనదీ అనుకున్న స్త్రీ వండిపెట్టిన మొదటి భోజనాన్ని ఏ మొగవాడు మర్చిపోతాడు ? భరతరావు ఆ భోజనం మర్చిపోలేదు. ఆమె ఏమంత ఎక్కువ పదార్థాలు చెయ్యలేదు. బంగాళాదుంప ముక్కలు కరకర వేగలేదు కూడాను. మీనాక్షి యింట్లో పెరుగు లేదు. వొట్టి మజ్జిగే. అయినప్పటికీ, కన్నెవలపుల కాంతులన్నీ ఆ వడ్డనలోనూ, మారు వడ్డించడంలోనూ, తినిపించడంలోనూ మధురాతి మధురంగా ఉన్నాయి.

మీనాక్షి తన భోజనంకూడా అయ్యాక తమలపాకులు చిలకలు చుట్టి, ఒక్కొక్కటే భరతరావుకి అందించింది. అతనేదో అంతుచిక్కని ఆలోచనలలో ఉన్నాడు—'' రైలు టైమవుతోంది''—అని మీనాక్షి జ్ఞాపకం చేసేటప్పటికి.

''అమ్మాయి జాగర్త, నాయనా. ఎప్పుడూ ఎక్కడికీ వంటరిగా పంపలేదు. యిన్నాళ్ళబట్టీ అంటిపెట్టుకునే వున్నాను. అది అమాయకురాలు—జాగర్త'' అంది మీనాక్షి తల్లి, వారిద్దరూ రిక్షాలు ఎక్కుతూవుండగా,

సెంట్రల్‌లో అన్నాడు భరతరావు మీనాక్షితో. "నిన్ను తిరుపతికి బదులు మరొకచోటికి తీసుకుపోతే ఏం చేస్తావు ?"

"మా అమ్మతో చెబుతాను."

"చెప్పి కొట్టిస్తావా ?"

"అంతకంటె పెద్ద శిక్షే !"

మర్నాడు ఉదయం తిరుపతి స్టేషన్‌లో దిగారు మీనాక్షీ, భరతరావూ.

## 5

స్టేషనుకి నాటక సమాజం తాలూకు వా రెవరో వచ్చారు. మీనాక్షీ, భరతరావులని ఎంతో మర్యాదగా వారి విడిదికి తీసుకువెళ్ళారు. భరతరావుకి ఈ పరిసరాలూ, మనుష్యులూ కొత్తగా ఉండటంలో ఆశ్చర్యం లేదు. కాని, మీనాక్షి మాత్రం నలుగు రైదుగురిని పేరు పేరున పిలిచి కుశల ప్రశ్నలు వేసింది. అందరిలోకి ఉమాపతి వీరికి సన్నిహితు డయాడు. ఉమాపతి భరతరావుకి కొత్తగాని, మీనాక్షికీ, మీనాక్షితల్లికీ ఎన్నోఏళ్ళబట్టి తెలుసు.

మధ్యాహ్నం భోజనా లయాక, అందరూ తాంబూలాలు వేసుకొన్నమీదట, ఉమాపతి భరతరావుతో చెప్పడం మొదలెట్టాడు.

"కళ అనండి, కాష్టం అనండి. ఈ నాటకాలున్నాయి చూశారూ, మనిషికి నిద్రపట్టనీవు. ఒక్కసారి దానిలో

పడ్డామా. యిక తెప్పరిల్లడం కల్ల. ఏవో రోజులు అలా గడచిపోవలసిందే. దీన్ని నేను ఈ భుజాలమీద పెట్టుకు మోశానండీ. అప్పుడు యింత దవుతుందని అనుకోలేక పోయాము.'' అంటూ మీనాక్షిని చూపెట్టాడు ఉమాపతి.

ఒక పక్కగా పరచుకున్న హోల్డాలు మీద బడలిక తీర్చుకొనేందుకు వొరిగివుంది మీనాక్షి.

''ఏమి టంటున్నాడు. మా మామయ్య'' అని భరత రావుని అడిగింది మీనాక్షి.

తంబాకు ఎఱ్ఱదనంతో పగడంలావున్న మీనాక్షి అధరం భరతరావుకి మహా ముచ్చటగా కనిపించింది.

''ఏమీ అనడం లేదమ్మా. నిన్ను చిన్నప్పుడు ఎలా మోశానో చెబుతున్నాను. నిద్దరొస్తూవుంటే పడుకో,'' అంటూ భరతరావునంక తిరిగి, చెప్పదలచుకున్నది అందు కున్నాడు. ''మా రోజులు గదూ-రోజులు మరీ చెడిపోయాయి. నాటకాలవాళ్ళకి వెనకా పరపతిలేదు; యిప్పుడూ లేదు. నేను పరువు ప్రతిష్ఠలకోసం విచారించడంలేదు. ఈ నాటక కళ నిష్కారణంగా మరణిస్తోందే అని విచారిస్తున్నాను. ప్రజల అభిరుచులు కూడా నానాటికి తీసిపోతున్నాయి. 'ఓరోరీ బండివాడా' పాట మేము పెద్దవాళ్ళముందు వినడానికి సిగ్గుపడేవాళ్ళం.''

''లోకానికి చెడిపోవడమంటూ ఏమీ లేదండి. అది నిరంతరమూ ముందుకిసాగుతూనే ఉంటుంది. నాటకాలు,

నాటకాల తర్వాత సినీమాలు, సినీమాల తర్వాత మరొకటి వస్తుంది. ప్రజలకి వినోదం కావాలి. నాటకం చూచినా అందుకే, సినీమా చూచినా అందుకే, వీధి భాగవతం చూచినా అందుకే.''

''అదే నే నొప్పను. ప్రజలకి కావలసింది వొట్టి వినోదం మాత్రమే కాను. వారికి వారి సమాజప్రతిబింబం కనిపించాలి. అందులో ఆ సమాజ ప్రతిబింబంనుంచి మీారు నవరసాల్లో ఏ రసాన్ని పిండినా వారికి ఆక్షేపణ లేదు. రసజ్ఞుడు కవిత్వపు లోతులు తరిచిచూస్తే, సామాన్యుడు కథా పాత్రలలో అంతర్లీనమవుతాడు. అనుభూతులు తేడా అయినప్పటికీ, రసోత్పత్తివల్లనే యిద్దరికీ హృదయస్పందన కలుగుతుంది. మనసుని కదలించేదే మహా కావ్యమ్. ఏవీ ఆలాటి కావ్యా లీనాడు?'' లోకం గొడ్డుబోయిం దన్నట్టు మొహంపెట్టి, చేతులు తిప్పుతూ భరతరావు వైపు చూచాడు, ఉమాపతి.

ఉమాపతీ భరతరావూ అలా ఒక గంటా గంటంపావు దాకా కళగురించీ, కళాకారులగురించీ, నాట్యకళగురించీ, నాటకాలకోసమై ఉమాపతి అమ్మేసిన యాభై ఎకరాలగురించీ ఎన్నెన్నో మాట్లాడుకున్నారు. కళామతల్లికి తన జీవితం అర్పితం చేశానన్నాడు ఉమాపతి.

''టెలిగ్రామ్; టెలిగ్రామ్'' అంటూ సైకిల్ బెల్ గణగణ మ్రోగింది బయటనుంచి. హాలులో అందరూ నిద్దర్లు పోతున్నారు. మీానాక్షితోసహా, ఉమాపతీ భరతరావూ

మట్టుకు లోకాభిరామాయణం చెప్పుకుంటూ కాలం గడుపు తున్నారు.

టెలిగ్రామ్ విప్పి ఉమాపతి నిర్విణ్ణు డవుతూ అన్నాడు: "మనవాళ్ళు అందువల్లనే ఎందుకూ పనికిరారు. నిన్న ప్రొద్దుట, ఆరు నూరయినా తప్పకుండా వస్తానన్నవాడు ఈ టెలిగ్రా మేమిటి చెప్పండి?" అంటూ టెలిగ్రాం భరతరావుకి యిచ్చాడు.

రామమూర్తి రావడంలేదు. రామమూర్తి రాకపోతే నాటకం పడటం ఎలా? నిన్న పొద్దుట్నుంచీ టికెట్లు అమ్ము తున్నారు. అందుకని నాటకం ఆపడానికి వీలులేదు. నాటకం పేరు 'స్త్రీశక్తి' అందులో ముఖ్యపాత్ర మీనాక్షిది. రామ మూర్తిని నాయకుడు అనడానికి వీలులేదుగాని ఒకరకంగా నాయకుడు.

రామమూర్తి రావడం లేదని తెలిసి, అందరూ నిద్దరల నుంచి లేచారు. కళ్లు నులుపుకున్నారు. బీడీలు అంటించారు: టీ కావలసినవాళ్ళు టీ టీ అని అరిచారు. ఈ టెలిగ్రామ్‌తో యిల్లు అంటుకున్నంత పని అయింది. ట్రూపుకి యజమాని ఉమాపతి. అటూ ఇటూ అయితే ఈయనని దుయ్యబట్టు కుంటారు కంట్రాక్టర్లు.

మీనాక్షితో చాటుగా మాటాడినమీదట భరతరావుని తెగించి అడిగాడు ఉమాపతి. "తప్పుగా భావించకపోతే, నా దొక చిన్నమనవి ఉంది. రామమూర్తి వెయ్యవలసిన పాత్ర మీరు వేసి, నలుగురిలో నా మర్యాద కాపాడండి."

ఉమాపతి భరతరావు చేతులు పట్టుకున్నాడు. భరతరావుకి చేతులూ, కాళ్ళూ వణకడంకాదు, ముచ్చెమటలూ పోశాయి. వెనక వైకుంఠం అవుపోసనం, ఈ సారి రామమూర్తి తండ్రికి ప్రాణంమీదికి రావడమనే అవస్థ రామమూర్తి తండ్రికి కాదు–తనకి. భరతరావు, కలవరపాటు చూచి మీనాక్షి పక్కకి పిలిచి చెప్పింది.

''మీరు నా కోసమని వెయ్యవద్దు. మీకు యిబ్బంది లేదని తోస్తేనే వొప్పుకోండి. రామ్మూర్తి రాకపోతే, వాళ్ళ అవస్థ వాళ్ళు పడతారు–మీరేం చెయ్యగలరు ?''

''ఉమాపతిగారు ఏమీ అనుకోరుగదా ? అని అడిగాడు భరతరావు.

''అనుకుంటే, మనకేం ! రామ్మూర్తి రాకపోతే మరొక భీమమూర్తిని తెచ్చుకుంటారు. ఇంతదాకావచ్చి నాటకం మానరు.''

''నువ్వు చెప్పినట్లు చేస్తాను.''

''అలా వొద్దు. మీ కిష్టముంటే వెయ్యండి. నా పరిస్థితి వేరు, మీ పరిస్థితి వేరు.''

మీనాక్షి నిర్మొగమాటంగా చెప్పింది. తనకి తోడుగా వచ్చిన మనిషి తనవల్ల యిబ్బంది పాలవకూడదు. కాని ఉమాపతి ఒక గంట నూరి పోసిన మీదట, భరతరావు జావలా జారిపోయి పాత్ర ధారణకి వొప్పుకొని, తన పోర్షన్ చూచుకోడం మొదలెట్టాడు.

పోర్షన్ చెబుతూ మీనాక్షి మరొకసారి వారించింది భరతరావుని. "మీరు ఆపైన ఏమీ అనుకో గూడదు." భరతరావు లోకాన్ని వెక్కిరించే యువకహాసం విసిరాడు.

రామ్మూర్తిగారి తండ్రి ప్రాణాపాయస్థితిలో ఉండటంవల్ల ప్రఖ్యాతి నటకులు భరతరావు బి. ఎ. గారు ఫలనా పాత్ర ధరిస్తున్నారని నాటక సమాజంవారు ముందే చెప్పడంవల్ల ఈ కొత్త మొహం ఎలావుంటుందో చూదామని అల్లరి చెయ్యకుండా కూచున్నారు ప్రేక్షకులు. నాలుగైదుచోట్ల తడుముకున్నప్పటికీ ప్రోమ్టర్ సాయంవల్ల భరతరావు బండి గట్టెక్కించేశాడు. అదీగాక భరతరావుకి ఈసారి వెనుకటి బెదురూ భయం లేకపోయినాయి. అందుకు ముఖ్యకారణం మీనాక్షి తన పక్కనుండటమే.

"మీలో మూంచి నటనా ప్రభావం వుంది" అన్నారు భరతరావుని నాటకం అయిపోయిన తర్వాత, సమాజంలోని యిద్దరు ముగ్గురు. ఈ మాటలు ఉమాపతే అనిపిస్తున్నాడా అన్నంత అనుమానంగా చూచాడు భరతరావు వారి వంక.

నాటకానంతరం మీనాక్షి యాభై రూపాయిలూ మీనాక్షికి యిచ్చేసి, భరతరావుకి ఒక ముప్పయి రూపాయిలు కవర్లో పెట్టి తీసుకు వచ్చి ఇచ్చాడు ఉమాపతి. భరతరావు తెల్లబోయి "ఇది నా కెందుకు?" అన్నాడు.

"ఏదో మా సంతోషం కొద్దీ!" అన్నాడు ఉమాపతి.

"నాకు వొద్దండి."

"అమ్మాయ్, నువ్వు పుచ్చుకొని తర్వాత యియ్యి."
అంటూ మీనాక్షి చేతిలో ఆ కవరు వుంచి, తొందర తొందరగా ఏదో పనిమీద వెళ్ళాడు ఉమాపతి.

"ఎందుకు మీనా, మనకది?"

"డబ్బు చేదటండి? మీచేత పని చేయించుకొని యిచ్చారు. వూరికే ఇచ్చారా?"

"నా కిష్టం లేదు సుమా!"

"మీ కీ విషయం తెలియదు లెండి. ఊరుకోండి."

"మీనా, బండికి టైమవుతున్నట్టుంది. ఇంక తెముల్చుకు పోదామా? ఈరైలు తప్పితే, సాయంత్రం నాలుగు గంటలకిగాని మద్రాస్ చేరుకోలేము."

"అయిపోయింది, ఇంకొక్క పదినిముషాలు. ఉమాపతి గారితో చెప్పేసి వెళ్ళిపోదాము."

రైలులో మీనాక్షి ఉమాపతి పుట్టుపూర్వోత్తరాలు చెప్పింది. చాలావరకు ఆయనే చెప్పుకున్నాడు భరత రావుతో. మిగతావి ఈమె భర్తీచేసింది. రైలు ఆర్కోణం దాటినతర్వాత మీనాక్షి అడిగింది—"మరి మీ ముప్పయి రూపాయలూ ఏం చేదాం?"

"నీకు నచ్చిన చీరె ఏదైనా కొనుక్కో."

"నా కెందుకు, బాబూ మీ సొమ్ము" అని చిలిపిగా చూసింది మీనాక్షి.

"నిన్న 'మనమే' యివ్వాళ్ళ వేరై పోతామా?"

"ఇవ్వాళ నేమిటి! హృదయంలో వేరునాటి చాలా రోజులుంది."

"మనకి తోడు కవిత్వం గూడానా? నేను సెక్రటేరియట్‌లో గుమాస్తాని; నువ్వు కులగౌరవాలులేని నటివి. ప్రాతఃకాలపు ఉషఃకాంతిలో మెరిసి, మధ్యాహ్నపు ఎండలో మలమల మాడిపోయే గడ్డిపోచలము మనం."

"అయ్యో బాబోయ్!.........దానికేం గాని, మీరివ్వాళ మా యింట్లోఉండి, రేపు వెళ్ళుదుగాని!"

"ఎందుకు?"

"ఊరికే నే."

మధ్యాహ్నం ఈ రైలు బడలికవల్ల నిద్రపోతామూ, సాయంత్రం దూరంగా ఎక్కడికైనా షికారు వెళ్దాం. మనం ఇంటికి వచ్చే వేళకి అమ్మ అన్నం వొండి పెడుతుంది. రేపు పొద్దున్న మీ దారి మీది, నా దారి నాది."

సరే నన్నాడు భరతరావు. అతని మనసులో ఆశలూ, భయాలూ అనంతంగా వున్నాయి. నాటకాలవాళ్ళు చెడ్డవాళ్ళు కాదు; మీనాక్షీ చెడ్డది కాదు. కాని లోకం వాళ్ళని ఆడిపోసుకుంటుంది. గుమాస్తాకి తోటి గుమాస్తాలమీదా, కార్మికుడికి తోటి కార్మికులమీదా, వైద్యుడుకి తోటి వైద్యులమీదా ఏచూదిరి వర్గ సంబంధమైన అభిమానం వుంటుందో, అలాటిదే నాటకాలవాళ్ళలో ఒకరిమీద ఒకరికి వుండటం భరతరావు కనిపెట్టాడు. గుమాస్తా తన

తోటి గుమాస్తాకి యింక్రిమెంటు వస్తే పైకీ, లోపలాకూడా ఏడుస్తాడు; అంతమాత్రాన గుమాస్తావర్గం మీద అతనికి కోపం జనించదు—ఎందుకంటే అతను కూడా అందులో ఒకడు గనక. అలాగే నాటకాల వాళ్ళలోకూడా ఏడుపులు వుండవచ్చు; కాని వారి బంధం మిగతా వర్గాలని బంధించే తాడుకంటె బలమయినది. కళ అనే సువర్ణ పాశమది.

భరతరావుకి ఈ నూతనాకాశంలోని వేగుజుక్కలాంటి మీనాక్షి మహా తమాషాగా వుంది. సంధ్యాసమయాన విశాలమైన ప్రదేశంలో ఒంటరిగా కూచుని అనంతాకాశం వైపు చూస్తూవుంటే, ఎలా మాటలకిమడని ఆలోచనలు వస్తాయో, అలాంటివి రాసాగాయి. అతనికి అంతా కొత్త కొత్తగా వుంది.

ఆ సాయంత్రం మీనాక్షీ భరతరావూ తాంబరంవైపు ఎలక్ట్రిక్ ట్రయిన్‌లో వెళ్ళారు. ఊళ్ళో తిరుగుతే భరతరావుని ఎవరైనా స్నేహితులు చూడవచ్చు. తాంబరం రైలు స్టేషన్‌లో దిగి కబుర్లు చెప్పుకుంటూ నడిచారు.

భరతరావుకి ఈ కథ ఏమీ బోధపడకుండా వుంది. చిట్ట చివరికి—మీనాక్షి గుప్పెట్లోని నీరా?—అనిపించింది. తనతో నవ్వుతూ మాట్లాడుతుంది, సరసని కూచుంటుంది. ఏ విషయమైనా మనసు విప్పిచెబుతుంది. తన దగ్గరనే ఉంది కాని తనకీ, ఆమెకీ యోజనాల దూరం.

భరతరావుని అవ్యక్త వాంఛలు గడబిడ చేశాయి ఏదో చెప్పాలని పెదవి దాకా వచ్చేది కాని మాట పెగిలేది

కాదు; ముఖమంతా చెమటలు పోసేది; కనుబొమలు ముడి పడిపోయేవి. "ఏదో చెబుదా మనుకుంటున్నట్టున్నారు ?" అని ముత్యాల పలువరసతో మీనాక్షి అడుగుతూ వుండేది. చివరికి అతనేమీ చెప్పలేక పోయేవాడు.

మీనాక్షి మనసుకూడా దేనికోసమో ఆత్రపడుతూనే ఉంది. ఇద్దరి మధ్యనూ ఉన్న ఆ మంచుకొండ కరిగితేగాని ఇద్దరి ప్రాణాలకీ హాయిలేదు. తాంబరమ్‌లో కాఫీలు తాగారు; తమలపాకులు వేసుకున్నారు. సంధ్య కాంతి చీకటితో కలిసిపోయిన తర్వాత స్టేషన్‌కి వచ్చారు. రైలు వచ్చింది. ఎక్కారు, దిగారు, యింటికొస్తున్నారు.

ఇద్దరి గుండెలూ దడదడ కొట్టుకుంటున్నాయి. ఎన్నో మాట్లాడుకుందామని ఏమీ మాట్లాడుకోలేక పోయారు. ఉత్సాహంగా చేతులు వూపుకుంటూ వస్తున్నారు గాని ఏదో కొరతపడినట్టు వుంది. యిల్లు ఇంకొక ఫర్లాంగు వుండనగా, మీనాక్షి భరతరావు చేతిని తన చేతిలోకి తీసుకొంది.

పదివేళ్ళూ ఒకటయాయి వారి నేత్రద్వయంలో చంద్రోదయమయింది. హృదయాలు పారవశ్యంతో నిస్త్రాణ జెందాయి. ఆ స్పర్శతో వారి దేహాలు పులకరించి జలదరించాయి.

"మీనా !"

"ఏమండీ !"

# 6

రెండురోజులు వూళ్ళోలేక మూడోరోజు ఉదయం గది తలుపు తెరిచేటప్పటికి భరతరావుకి కొత్త కొత్తగా వుంది. అదీగాక ఈ రెండురోజులూ సామాన్యమైన రోజులా? స్నేహితు డన్నవాడికి తాను ఎక్కడికి వెళ్ళినదీ తెలియదు. అంతా బందోబస్తు చేసుకునే వెళ్ళాడు. ఒకవేళ పైకిపొక్కి, నలుగురికీ తెలిస్తేమాత్రం పీక నులిమేస్తారా? తనంతటి వాడు తను.

తలచుకొన్నకొద్దీ భరతరావుకి బ్రతుకంతా విచిత్రంగా కనిపించింది. ఈ చక్రాన్ని తిప్పేవా డొకడు వెనక వున్నాడో లేదో తెలీదుగాని, చక్రంమాత్రం మహా రమ్జుగా తిరుగుతోంది. నాటకాలూ, తద్వారా మీనాక్షి పరిచయం. యివన్నీ పేర్చుకు చూస్తే, మహామునులు తపోభంగంవల్ల రాజులై పుడతా రన్నట్లు, తను ఏ రాఘవాచారో అవడానికి బదులు సెక్రటేరియెట్ గుమాస్తా అయి కూచున్నాడేమో; జీవన గమనంలో క్రమం లేదని మనం పొరబడుతాముగాని, హరిశ్చంద్ర పాత్ర ఏదో తప్పనిసరి అని వేస్తే, మళ్ళీ తిరుపతి నాటకంలో తన నెత్తినే పడాలా ఆ బరువు! రామ్మూర్తి తండ్రికి ప్రాణాపాయస్థితి, సమయం గుర్తెరిగి, ఎందుకు రావాలి? ఇదంతా కాక వృద్ధిలోకి రాదగిన పిల్ల, యింకెవరూ లేనట్టు తనమీదనే అంత మక్కువ ఎందుకు చూపాలి? తవ్వగా తవ్వగా పురాతన

శిథిలాలు దొరికినట్లు, తర్కించి తర్కించి చూడగా ఈ ప్రవాహానికి ఒక ప్రత్యేక ధోరణి కనిపిస్తోంది.

బి.యె. పాసైన నటుడికి గిరాకి ఎక్కువ ఉంటుంది. అంచేత, బి.యె. అయి, యిందులో ఏర్పాట మొందుకని వ్యాకులపాటు అవసరం. మీనాక్షి పక్కనుండటం కూడా క్షేమగ్గానే ఉంటుంది. ఐతే తను ఒక రాజీనామాపత్రం దాఖలుచేసి నాటక కళకి అంకితం అయిపోతే.....

ఇవి వెర్రి ఆలోచనలని అరగంట పోయాక అనిపించింది. పెద్దపెద్దవాళ్ళు పూనుకుంటే గాని రాని· ఈ ఉద్యోగానికి, మబ్బులో నీరు చూసి ముంతలో నీరు పారపోసినట్టు, చూస్తూ చూస్తూ తిలోదకాలు యివ్వడమా? అది ఎంతమాత్రం జరగదు. మీనాక్షీ తనూ పెళ్ళిచేసుకోవడం గనక తటస్థిస్తే అప్పుడామె నాటకాలు వెయ్యడం మానేస్తుంది తను తీసుకొచ్చే నాలుగు రాళ్ళూ ఆమె చేతుల్లో పోస్తాడు, గుట్టుగా కాపరం సాగిపోతుంది.

"నాయనా, భరతరావ్!"

అది నరసింహంగారి కంఠం. వెంటనే తలుపు తెరిచాడు భరతరావు.

"తిరపతి దర్శనం చేసుకొచ్చావా?"

క్షణకాలం బెదిరి, "ఆ ఆ" అన్నాడు. నరసింహంగారితో తను ఏడు కొండలవాడిని చూసేందుకు తిరుపతి వెళ్ళుతున్నానని చెప్పాడు. విషయం నెమరువేసుకుని తల వూపాడు.

"నాయనా, గిట్టనివాళ్ళు రకరకాల మాటలు అంటారు. కొందరు ఏదో పనిగట్టుకునివచ్చి నీలాపనిందలు వేస్తారు. వాడి మొహం చూస్తేనే నాకు పరమ అసహ్యం వేసింది."

"ఎవరం డతను?"

"ఏమో పేరడగలేదు. పొట్టిగా ఉంటాడు. మీ ఆఫీసులో పనిచేస్తున్నాడట. నీ కోసమని మొన్న మధ్యాహ్నం వచ్చాడు. గది తాళం వేసివుంటే, ఎక్కడికో వెళ్ళాడేమో అనుకుని పోవచ్చునా—అలా పోక, నేను భోజనంచేసి బయటికి వచ్చేదాకా, ఒక అరగంటసేపు ఈ అరుగుమీద చతికిలబడి కూచున్నాడు."

"ఆ...ఆ..."

"ఏమండీ! భరతరావుగారు ఎప్పుడు వస్తారు—అని అడిగాడు. తిరుపతి వెళ్లావనీ, సోమవారం ఉదయానికి వస్తావనీ చెప్పాను. వెకిలిగా నవ్వుకుని "శుభ్రమైన ఉద్యోగం ఉండగా నాటకాలలో వేషం వెయ్యడ మెందుకు?" అని ఏమేమిటో వాగాడు. నాయనా! పెద్దవాణ్ణి గనక అడుగుతాను. నీకు నాటకాలమీదగాని ఆసక్తి ఉందా?"

"రామ...రామ" రామ శబ్దం ఎంత చక్కగా పలక గలిగినదీ తనలో తాను శ్లాఘించుకున్నాడు భరతరావు.

"పక్కనున్న తిరపతి యిన్నాళ్ళబట్టీ చూడలేదు గదా అని బయలుదేరాను. భగవద్భక్తిమాట అటువుంచి, ప్రకృతి దృశ్యం ఎంత బావుంది! కొండమీది కోతులు ముద్దొస్తూ

వున్నాయి. పసరు కోనేట్లో స్నానంచేసి, స్వామిదర్శనం చేసుకు, ఆ సాయంత్రం దిగువ తిరపతికి వచ్చేశాను. మన యాత్రస్థలా లన్నిటిలోనూ ఏదో మహత్తర శక్తి ఉందంటే నమ్మండి. అవన్నీ మంత్రముగ్ధములైన ప్రదేశాలు, మోకాలి పర్వతం ఎక్కి, పదినిముషాలపాటు కూచున్నప్పుడు, అలసట అంటే ఏమిటో, సేద దీర్చుకోవడ మంటే ఏమిటో అర్థ మయింది...ఏమన్నాడు—ఆ వెధవ పీనుగ ?'' భరత్‌రావు స్టేజిమీద కంటె చక్కటి ఫెర్ ఫార్ మెన్సు యిచ్చాడు నర సింహంగారి ముందు.

నరసింహంగారు అలకానందం గురించీ, విష్ణుప్రయాగ గురించీ, హృషీకేశమ్ గురించీ, కాసిని ముక్కలు చెప్పారు. బదరీనాథ్ కేదారనాథ్‌లు తను ఎప్పుడో ఒకప్పుడు సందర్శించి తీరుతానన్నాడు భరతరావు. నరసింహంగారు తృప్తి పడి లోనికి వెళ్ళిపోయాడు.

గండం గడిచి పిండం బయట పడినందుకు భరతరావు నిట్టూర్పు విడిచాడు. కాని అతని ఆత్మలో ఒక క్లేశం పట్టు కుంది. తను ఎందు కీఅబద్ధాలు, అవి పచ్చి అబద్ధాలు అని తెలిసికూడా, వాటికి బంగారు పూత పూసి ప్రచారం చేస్తు న్నాడు ? నీరు పల్ల మెరుగు నన్నట్లు, నిజం నేడు కాక పోతే, రేపయినా వెల్లడి కాకమానదు. మీనాక్షీ తనూ కలిసి తిరపతి వెళ్ళామని నరసింహంగారికి చెప్పే ధైర్యం తన కెందుకు లేకపోవాలి ?

భరతరావుకి ఆ ధైర్యం ఉండటంకల్ల. ఏ పరిస్థితుల తాకిడివల్లనో, ఏ నటనా విశేషం వల్లనో అతనికీ, మీనాక్షికీ జోస్యీ కుదిరింది. అది పెనవేసుకుపోవడం సృష్టి ధర్మం. కాని డిప్టీక లెక్టరు మూడవ కుమారుడూ, సెక్రటేరియట్ గుమాస్తా, శుష్కమర్యాదలేగాని నిజతత్వాం చూసే స్వాభావిక గుణం లేని మధ్యరకం కుటుంబాల్లో జన్మించినవాడూ అయిన భరతరావు పదిఅడుగులకి పైన చూడలేడు. మధ్యేమార్గం అవలంబించే జీవితాలన్నిటికీ ఉండే అవస్థే అంత. సంఘంలో నూటికి తొంభయిగుంది మధ్యరకం మనుష్యులు. మిగతా పదిమందిలో కొందరు ఈ చివరినీ కొందరు ఆ చివరినీ ఉంటారు. పది రూపాయలు వెనకేసుకున్న బీదవాడు మధ్య రకం మనిషై, బీదరికంలో తనకి వుండే స్వేచ్ఛందతని గోల్పోతాడు.

అలాటిదే భాగ్యవంతుల స్థితి కూడాను. జీవితావసరాలకి మించిన ధనం వుండి, జీవనపోరాటంలో తల దూర్చని భాగ్య వంతులలో కూడా కటిక పేదవానిలోని స్వేచ్ఛందత కని పిస్తుంది. సూదిబెజ్జంలోంచి ఒంటె అయినా వెళ్ళుతుంది గాని భాగ్యవంతుడు స్వర్గద్వారాలు తెరుచుకుపోలేడని ప్రవక్త చెప్పాడు గనక భాగ్యవంతులలో స్వేచ్ఛందత ఉండ టానికి ఆస్కారం లేదని చాలామంది అనుకుంటారు. అది నిజంకాదు. మధ్యరకం కుటుంబీకులతోనూ, మామూలు మనుషులతోనూ జడమైపోయిన ఈ సంఘానికి చైతన్యాన్ని

యిచ్చేది బీదలూ, భాగ్యవంతులూను. ముప్పయి ఎనిమిది కోట్ల జనాభాగల భారతదేశంలోని భాగ్యవంతుల సంఖ్య రెండువేలుమాత్రమే. ఆ రెండు వేలల్లోనూ ధార్మికులూ, సత్యగుణ సంపన్నులూ, ఉత్తమ పురుషులూ లేకపోలేదు. ఇక బీదల సంఖ్య? బీదతనానికి కొలమానం లేదు, ఈ బీద దేశంలో, కలిమి అనగా తన జీవితాంతం దాకా తనూ తన వాళ్లూ పస్తువుండకుండా ఉండటం; లేమి అనగా అది కానిది-అని అర్థమవుతోంది మన దేశంలో ఈనాడు. డిప్టీకలెక్టర్ ఆ ఊళ్లోని బట్టలకొట్టు రామయ్యకంటె బీదవాడు అయి వుండవచ్చు. ఒకరిది అధికారబలం, మరొకరిది ధనబలం. కాని యిద్దరి మనసులూ మామూలురకం మనుషుల సూత్రాల ననుసరించే నడుస్తాయి. ఉన్నదానితో పొట్ట బోసుకు గుట్టుగా కాలక్షేపం చెయ్యడమే మామూలురకం మనుషుల ధర్మం. అలాంటి-చోట పుట్టిన భరతరావు ఒక్క-తోపుకి ఎక్కడో వెళ్ళి పడ్డాడు. మీనాక్షిని వొదిలించు కోనూ లేడు; ఆమెని నెత్తిని పెట్టుకోనూ లేడు. ఈ రెంటికీ మధ్యని అబ్బుతున్న కొత్త విద్య ఏమిటంటే, వంచన. అది లోకవంచన, ఆత్మవంచన కూడాను!

అదే సాయంత్రం అయిదున్నరకి భరతరావు యింటి ముందు స్పోర్ట్స్ కారు హారన్ దబదబ మోగింది. సిల్కు-రుమాలు తలకి జుట్టుకు అరుణ ఒక్క-ర్తే స్టీరింగ్ దగ్గర కూచునుంది. చటుక్కున చొక్కా తగిలించుకు వీధిలోకి వచ్చాడు భరతరావు.

తలుపు తెరచి "ఇలా కూచోండి" అంది అరుణాదేవి, అధికారయుతంగా. భరతరావు కూచున్నాడు. ఎక్కడికో చెప్పక అరుణ తీసుకుపోతోంది—స్పీడ్ మీటర్ నలభై యాభై మధ్య చూపుతూంది.

"మీ రేమీ భయపడకండి. సినీమాలోకి మల్లే ఈ కారు తలక్రిందులై మనిద్దరమూ హాస్పిటల్ చేరుకోము. నిర్జన ప్రదేశంలో మీతో కొన్ని సంగతులు మాట్లాడదలచు కున్నాను. అందుకని తీసుకు వెళ్ళుతున్నాను."

అరుణాదేవి మూడ్స భరతరావుకి కొత్త కాదు. కాని ఏమి ఉపద్రవం ముంచుకొచ్చిందో అతనికి బోధపడటం లేదు. ఎన్నూరు బీచి దగ్గర కారు ఆపి, "రండి యిసుకలో కూచుందాం" అంది. సంధ్యాసమయ శోభని చూసేటట్లు లేవు వారి మొహాలు.

అసలు ఈ ఉప్పెన యిలా ప్రారంభమయింది. తన ఫ్రెండ్స ఇంటర్ రిజల్ట్సు తెలుసుకునేందుకు గడిచిన సాయంత్రం పత్రిక పట్టుకు రమ్మంది అరుణాదేవి ప్యూన్‌తో. సాయంత్రం వెలువడే ఇంగ్లీషు పత్రికలన్నీ ఖర్చయిపోవడం వల్ల, ఒక తెలుగు పత్రిక పట్టుకొచ్చాడు వాడు. అందులో యింటర్ పరీక్షా ఫలితాలు వున్నదీ లేనిదీ వాకబు చేసిన మీదటే కొన్నాడు ఆ ప్యూన్. "ఏదో ఒకటి యిటు తే" అని వాడి చేతిలోనుంచి పేపరు లాక్కుని, తన ఫ్రెండ్సలో ఎవరెవరు గట్టెక్కినదీ, ఎవరెవరు డింకీ కొట్టినదీ తేల్చుకుని,

ఆ పేపరు భద్రంగా మడిచి, తన గదికి తీసుకుపోయింది. రాత్రి భోజనాలయాక పక్కమీద పడుకుని, మళ్ళీ నెంబర్లు చూస్తూ వుండగా, ఆ నెంబర్లకి దిగువని చిన్న వార్త కనిపించింది స్వతహాగా అరుణాదేవి వార్తాపత్రికలు అసలు ముట్టదు. ఆనాడు ఆ పత్రిక తెప్పించక, మర్నాటి ఉదయం "హిందూ" వచ్చేదాకా వోపిక పట్టివుంటే, అరుణాదేవి తన జీవితంలో కొన్ని కోల్పోయేది కాదు.

"ఫలానా సంస్థ సహాయార్థం వేసిన నాటకంలో భరతరావు బి. యె. గారి నటన మీనాక్షి నటనతో సరితూగగలిగిందని—యింకా ఏవేవో వివరాలు వున్నాయి... మన విలేఖరి తిరుపతినుంచి రాశాడు.

అరుణాదేవి ఆ రాత్రి మూడు గంటలదాకా నిద్రపోలేదు–భరతరావు యింతపని చేస్తాడా అని.

యిసుకలో కూర్చున్నమీదట అరుణాదేవి అడిగింది. "మీ రెందుకు వెళ్ళారు తిరపతి? ఆ మీనాక్షీ ఎవరు? అన్నయ్య ఏమనుకుంటున్నాడో మీ గురించి తెలుసా?"

ఉన్న సంగతి దాచకుండా అరుణాదేవికి చెప్పాడు భరతరావు. ఏ చిన్న విషయమూ దాచలేదు. విశాలమ్‌కి ఈ సంగతి యింతకు పూర్వమే చెప్పగలిగే ధైర్యం తనకి లేకపోయిందని కూడా వొప్పుకున్నాడు. తనకి ముందు వెనకలు తెలీడం లేదని వాపోయాడు.

"అన్నయ్యే ఈ సంగతి కనుక్కోమని నన్ను పంపించాడు. లేకపోతే నా కెందు కివన్నీ! తనకి చెప్పరేమోనని

నన్ను పురమాయించాడు ఈ పనికి.'' అరుణాదేవి చెబుతున్నది నిజం కాదు.

''మీరు చెప్పండి—ఏం చెయ్యమంటారు నన్ను! మీనాక్షి వెంట నేను తిరపతి వెళ్ళడం తప్పంటారా?''

తప్పొప్పుల పట్టిక చెప్పరు అరుణాదేవిలాంటి మనుషులు. ఆమె హృదిలో దావాగ్నులు చెలరేగుతున్నాయి. కాని తియ్యటి మందహాసంతో ''మన మీనాక్షిని నాకు చూపించరూ?'' అని అడిగింది.

''ఓ—తప్పకుండాను.''

''మీరు ఉద్యోగం మానుకు కళాసేవ చెయ్యడం నాకిష్టం లేదు—నా యిష్టంతో ఏముందిగాని మాట వరసకి చెబుతున్నాను. మీ నాన్నగారికీ, అమ్మకీ యిదంతా తెలుసా?''

''తెలియదు. తెలిస్తే వాళ్ళు వొప్పుకోరు.''

''మీరు మీనాక్షిని నిజంగా ప్రేమిస్తున్నారా?''

అరుణాదేవి ఆ ప్రశ్న అడిగేటప్పటికి భరతరావు సిగ్గుపడి, ''అదేమో నాకు తెలియదు''—అన్నాడు.

ఎన్నార్ కి బయలుదేర దీస్తున్నప్పుడు అరుణాదేవి భరతరావుని చెడమడా తిడదామనుకుంది. కాని అతని ధోరణి గమనించి మార్గమది కాదనుకొంది. భరతరావు మీనాక్షినే కాదు, ఆ నాలుగు వేల రూపాయిల కట్నంతో వస్తున్న పిల్లని పరిణయమాడుతున్నా యిలాగే వ్యాకుల

పడేదేమో॰ అరుణ! దానికి బంధుమిత్రాదుల ముద్ర ఉంటుంది గనక, యింత బాధగా వుండేది కాదు. తమ యింట్లోవాడిలా మసిలిన భరతరావు, నామరూపాలు లేని ఒక చవకబారు పిల్లకి అంకితమై పోతూవుంటే చూస్తే సహించడం ఎంత కష్టం-ఎంత కష్టం!

కారులో యింటికి వస్తున్నప్పుడు అరుణాదేవి భరతరావుతో అంది : "మనం మాట్లాడుకున్నవి అన్నయ్యతో అనకండి. మీనాక్షి గురించి కూడా యిప్పు డేమీ చెప్పకండి."

"అన్నయ్యే పంపించా డన్నారుగా!"

"వుట్టినే అన్నాను."

భరతరావు తెల్లబోయాడు. ఇంకొక నూతన సత్యం పొడగట్టిం దతనికి. తను నిజం చెబితే, లోకం అబద్ధమాడుతుంది తను అబద్ధ మాడితే లోకం నిజమనుకుంటుంది. లోకమంటే నరసింహంగారూ, అరుణాదేవీ మాత్రమే. నిశ్చయంగా యిదంతా మాయామేయ జగమ్.

# 7

అరుణాదేవి తనను యింటిముందు దిగవిడిచి వెళ్ళినతర్వాత, భరతరావు గదిలోకి వెళ్ళి అద్దంలో చూసుకు పకపకా నవ్వుకున్నాడు. ఇదంతా ఒక మహానాటకం లా కనిపించింది. ప్రపంచ మొక రంగభూమనీ, అందులోని స్త్రీపురుషులు

నాటక పాత్రధారులనీ షేక్స్పియర్ అన్న పలుకులు పదే పదే చెవులలో మ్రోగాయి. షేక్స్పియర్ మాటలే జ్ఞాపకం వుండి, మిగతా మహాకవుల నిర్వచనాలు ఏవీ ఎందుకు స్ఫురణకి రాలేదంటే—ఆతను యింటర్‌లోనూ, బి.యే. లోనూ షేక్స్పియర్ మాత్రమే చదువుకున్నాడు.

తనని చూస్తే తనకే వింతగా తోచింది. తను చిట్టచివరికి ఎక్కడికి తేలుతాడు? ఈ ఉద్యోగంపోయి, 'నా' అనేవాళ్లు ఎవరూ లేక మీనాక్షి తనూ (ఆమె తల్లితో సహా) ఏ పూరిపాకలోనో అంతమవుతారేమో! అరుణాదేవి మీనాక్షిని చూపమంటుంది ఎందుకు? మీనాక్షిని చూపమని అడుగుతూ వికాశమ్‌కి ఈ సంగతేమీ తెలియపరచవద్దంటుంది—అదెలా సాధ్యం? అరుణాదేవికి అమాంతం తన మీద యింత ఆసక్తి ఎందుకు పుట్టుకురావాలి? వసంత సమీరమూ చందన వాయువులూ అతన్ని గజిబిజి చెయ్యడమే కాకుండా ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. ఊపిరాడక బాధపడుతున్నాడు.

ఒక వారం రోజులు గడిచింది. మీనాక్షిని ఒక్కసారి చూసివచ్చాడు. ఎవరో నాటకం కంపెనీవాళ్ళు ఉండటం వల్ల ఎక్కువసేపు మాట్లాడటానికి వీలు లేకపోయింది "ఆదివారం పూట అయినా వస్తూవుండండి, బాబూ" అంది మీనాక్షితల్లి. "ఎల్లుండి ఆదివారమేగా—రాకూడదూ!" అంది మీనాక్షి—'అప్పుడే మర్చిపోయారా మనమధ్య

పెనవేసుకుంటున్న ప్రణయలతని' అన్నట్టు మొహంపెట్టి. మీనాక్షి తల్లి సవినయంగా అడిగితే, మీనాక్షి అధికార యుతంగా అడిగింది. ఒక చిన్న చనువుతో స్త్రీ పురుషుడి మీద సంపాయించగలిగే శక్తికి ఇదే ఉదాహరణం. సరే నన్నాడు భరతరావు.

అరుణాదేవీ వికాశమూవచ్చి ప్రతి సాయంత్రం తనను పట్టుకుపోతూ వుండేవారు. సెక్రటేరియట్ గుమాస్తాకి అంతటి భాగ్యవంతులతో చెలిమి తగదు గాని, వికాశమ్ అలాటివాడు కాదు. ఏ నాటికైనా సోషలిస్ట్ లీడరు కాక పోడు. ఒక సాయంత్రం మెరీనా కాంటీన్‌లో కాఫీతాగి, బీచి వొడ్డున కూచుని వుండగా మాటల ధోరణి యిలా నడిచింది.

"నువ్వు ఈ ఉద్యోగం మానేసి యం.యె. లో జాయి నవు. లేదా ప్రయివేటుగా చదువు."అన్నాడు వికాశమ్.

"నాన్నమీద ఆధారపడటంకంటె నాకు నేను సంపా యించుకోవడంలో సుఖం ఉంటుంది—"

"ఏమి సుఖం! గొడ్డులా చాకిరీ చేస్తే నూటపది యిస్తారు."అన్నాడు వికాశమ్.

"కష్టపడి సంపాయించుకోవడంలో వున్న సుఖం నీకు తెలియదన్నయ్యా! అది నువ్వు వొప్పుకోవలసిందే"అని అరుణాదేవి, భరతరావు వాదానికి బలం యిచ్చింది.

"నేను అది అనుభవించకపోయినా, అర్థం చేసుకో గలనుగా! 'పని' అనేది ప్రతి ఒక్కరూ చెయ్యవలసిందే—

సోమరులూ, అప్రయోజకులూ మినహా, ప్రతి ఒక్కరూ 'వర్క్' చేస్తూనేవుంటారు. ఎవరు ఏ 'వర్క్' చెయ్యాలనేదే ప్రశ్న. కార్మిక కర్షకులే, చెమటోడ్చి పనిచేసేవారే, నుదుటి మీది స్వేదబిందువులు తుడుచుకునేవారే 'వర్క్' చేస్తున్నట్టు కాదు. మిగతా వాళ్ళది కూడా 'వర్కే' అరుణ యం. యె. పాసై కట్టెలపొయ్యిదగ్గర కూచోనలసివస్తే అసలు యం. యె. చదవడ మెందుకని అడుగుతా. పయిగా, నిప్పు రాజెయ్యడం చేతకాక బాధపడుతుంది కూడాను.''

''భలే ఉపమానం తెచ్చావ్ అన్నయ్యా. ఒకవేళ నేను వండవలసి వచ్చినా ఎలక్ట్రిక్ కుక్కర్ మీద వంట చేస్తాను.''అంది అరుణాదేవి.

''దాని ఖరీదు పదహారువందల రూపాయలు. బి. యె. పాసైన గుమాస్తాకి సంవత్సరపు టాదాయం కూడా అంత ఉండదు''అని తన అభిప్రాయం వెలిబుచ్చాడు భరతరావు.

''చెప్పు. అన్నయ్యా! యింక సోషలిజమ్‌గురించి చెప్పు. 'సోషలిజమ్ వచ్చేదాకా ఈ దేశం బాగుపడదు. ఏ ఒక్కరి నెలసరి ఆదాయం వెయ్యి రూపాయిలు దాటకూడదు; వంద రూపాయిలు తగ్గకూడదు. భారీ పరిశ్రమలన్నీ ప్రభుత్వపరం కావాలి'—వొప్పజెప్పవేమి యింకా ఆ పాఠం?'' అంది అరుణాదేవి.

సోదరి ఛలోక్తికి నవ్వుకుని వికాశమ్ అన్నాడు; ''సోష లిజమో, ఏ యిజమో గాని మన భరతరావు అలా 'రాట్'

అవడం నా కిష్టంలేదు. మనం చూస్తూ ఊరుకోకూడదు. ఏమంటావు, అరుణా!''

''ఇదిగో రెండు చేతులూ యిస్తున్నాను. ఇద్దరూ చెరో చెయ్యీ పుచ్చుకు లేవనెత్తండి. నాకేమీ అభ్యంతరం లేదు'' అన్నాడు భరతరావు. అనుకోకుండా అది యాక్టింగ్గా వూరుకుంది.

''హరిశ్చంద్ర వెయ్యడం వృథా కాలేదు''—అన్నాడు వికాశమ్.

''అంతవరకే తెలుసు, ఆపైన తెలీదు-నోరుమూసుకో'' అన్నట్లుగా చూసింది అరుణాదేవి భరతరావు వంక. రహస్యాలు స్త్రీలతో పంచుకోడమంత ప్రమాదం అదేగాని మరొకటి లేదు. ఆ రహస్యాలతోటే వుచ్చులల్లి యజ్ఞపశువుగా చేస్తారు మొగవాణ్ణి. ఎంత తరఫీదు పొందినా పురుషుడు ఆ విద్యలో స్త్రీలని మించలేడు.

భరతరావు నవ్వి వూరుకున్నాడు.

''నువ్వు అమెరికా వెళ్తావుటోయ్ !'' అన్నగారు అంత తఫీమని అడగటం అరుణకి నచ్చలేదు. కాని ఏమి చేస్తుంది? ఎవరి నైజం వారిది.

''పంపించే నాథుడుంటేసరి! పట్టుశాలువా కప్పుతానంటే వొద్దనే నిర్భాగ్యుడు వుంటాడా?''...

''సరి. ఎల్లుండి ఆదివారం మా యింటికి డిన్నర్కి రా. మా ఫాదర్ రేపు సాయంత్రం వస్తారు ఢిల్లీనుంచి. డాడీ

తలుచుకుంటే, యిట్టే సంపాయించగలరు, నీకు స్కాలర్ షిప్. నువ్వూ తెలుసుగా ఆయనకి. నేను ప్రత్యేకంగా నీగురించి చెప్పవలసిన దేమీ ఉండదు. ఎలా వుంటుం దంటావ్ అరుణా!''

''నాకేం తెలుసు! అమెరికా వెళ్ళేవాడు ఆయనా, పంపించేది నువ్వూ—మధ్యని నా కేం తెలుసు!''

కాలేజిగరల్ చమత్కారంకోసం పలికే పలుకు లవి, అరుణాదేవికి తెలియని దేముంది! నిజానికి యిదంతా అరుణా స్కీము. భరతరావుని ఎన్నార్ తీసుకు వెళ్ళినరాత్రే, అన్నగారితో రెండు గంటలసేపు చాలా సీరియస్‌గా మాట్లా డింది అరుణ. మీనాక్షీ తిరుపతి నాటకం మట్టుకు చెప్ప లేదు. తన మనసులో మాట అన్నగారి చెవిని వేసింది. నాన్న తమ దగ్గ్రాకి భరతరావు తగడని అనేమాట ఖాయం. అందుకని భరతరావుని హాయ్యర్ స్టడీస్‌కోసం అమెరికాకి ఒక రెండేళ్ళపాటు పంపించడం, ఈలోగా అరుణ బి. యె. కూడా అయిపోతుంది. అటు అరుణ కోరికా తీరుతుంది; అటు డాడీ కూతురు తనను ఎదిరించిందని కించపడవలసిన అగత్యమూ ఉండదు. అరుణ తండ్రి కూడా చాలా సౌమ్యుడు. ఎటోచ్చీ, భరతరావుకే ఈ గొడవ ఏమీ తెలీదు.

అమెరికా గురించి జనించిన కలలలో మీనాక్షితో తను ఆదివారం వస్తానని అన్నమాట కూడా మర్చిపోయాడు భరతరావు. పేకాటలో ఈసారి ఏమి ముక్కలు వస్తాయా—

అని ఎదురు చూస్తున్నట్టువుంది అతని స్థితి. తనని మామూలు గుమాస్తాగా బతకనీక, కాలపురుషుడు ఈ సువర్ణ స్వప్నాలు తన కెందుకు కలిగిస్తున్నాడా—అని కోపగించాడు భరతరావు.

ఆదివారం ఉదయం మీనాక్షి యింటికి వెళ్ళి, తను సాయంత్రం దాకా వుండనందుకు ఏదో కల్లబొల్లి ఖబుర్లు చెప్పి, వికాశమ్ బంగాళాకి వెళ్ళాడు. పాలమీగడలాంటి షిఫాన్ చీరెమీద, వూదా జాకెట్టు వేసుకు అరుణాదేవి ముందు నడవలోనుంచుంది. బాబ్‌డ్ హెయిర్‌కి రిబ్బన్ చుట్టి, జుట్టులో ఏవో పువ్వులు తురుముకుంది. చెవులకి దుద్దులు అప్పుడప్పుడు పెట్టుకుంటుంది గాని, యివ్వాళ పెట్టు కోలేదు. మెళ్ళో సన్నని బంగారు చెయిన్ ధగధగా మెరు స్తోంది. ఒక చేతికి ముత్యాల గాజులూ, మరొక చేతికి ముచ్చటైన వాచీ. లిప్‌స్టిక్ వేసుకుందా లేదా అన్నట్టు న్నాయి పెదవులు.

దూరంనించే భరతరావుని విష్‌చేస్తూ ఆహ్వానించింది. లోపలికి వెళ్లుతున్నప్పుడు నెమ్మదిగా చెప్పింది. అతని చెవిలో, "డాడీ ఏమి ప్రశ్నలు వేసినా నిర్భయంగా చెప్పండి. భయపడకండి. గుమాస్తా గిరి మర్చిపోయి, మనిషిలా మసలండి."

భరతరావు ప్రాణం చివుక్కుమంది. కాని అది బాధ పడేందుకు టైము కాదు. ముందుకి సాగవలసిందే మేరుపర్వతంమీద తనను కూచోబెట్టడానికి పూనుకున్నట్టు

వుంది. ఆ అదృష్టం అదే యేమోనని చూఛాయగా తోస్తూంది గాని నిర్ధారణగా తెలియడం లేదు.

లంచ్ టైము మహదానందంగా గడిచిపోయింది. భరత రావు ఫాదర్ ని డాడీ ఎప్పుడో కలుసుకున్నాడట. అసలు డాడీ కలుసుకోనివాళ్ళు ఎందరు ఉన్నారు గనుక! అంతా ఓ. కె. ఓ. కె. లతో గడిచిపోయింది. ఆదివారం కనుక కాసేపు బ్రిడ్జి ఆడారు. డాడీ, బ్రదర్ ఒక పార్టీ; అరుణా భరతరావూ ఒక పార్టీ. అరుణా భరతరావులు రెండు రబ్బర్లు నెగ్గారు. సాయింత్రం టెన్నిస్ డాడీ కూడా ఆడారు. డాడీ ఆరోజంతా బలే సరదాగా ఉన్నాడు. మంచి మూడ్స్ లో వున్నా నాడే వ్యవహారం తలపెట్టాము గదా అని విశాళమ్ లోలోన సంతోషించాడు.

డాడీకి శనివారం రాత్రే "అరుణ మనసు" విశాళమ్ తెలియపర్చాడు. "ఇప్పుడు మనం పెళ్ళిచెయ్యడం లేదు గదా! రెండేళ్ళు అమెరికాలో ఉండి రానీయండి. అప్పు డేదో ఒక ఉద్యోగం కుదర్చవచ్చు మీరు. తల్లిలేని పిల్ల— దాని యిష్టప్రకారం చెయ్యడమే బావుంటుంది" అన్నాడు విశాళమ్. డాడీ గంటా గంటన్నర సేపు తీవ్రంగా ఆలోచించి అరుణని పిలిచి అడిగాడు; "అమ్మాయ్! అమెరికానుంచి వచ్చినతర్వాత అతను నిన్ను చేసుకోనంటే!"

"అంత కృతఘ్నుడయితే నేనుమాత్రం విచారిస్తానా? ఉన్నపాళంగా చేసుకోవడం నా కిష్టంలేదు."

డాడీకి కూతురు అంతఃకరణ అర్థమైపోయింది. తనకి మల్లేనే కూతురు కూడా ప్రతీదీ నిదానంగా చూస్తుంది. ఇంతకీ మన మేదో మంచిచేస్తా మంటున్నాము గాని, పిల్ల నిచ్చి పెళ్ళి చేస్తామని అనడం లేదుగా! ఒ.కె.ఒ.కె—అనుకున్నాడు.

రాత్రి భోజనా లనంతరం డాడీ భరతరావుతో అన్నాడు; "విశాళమ్ చెప్పాడు నిన్ను గురించి. అమెరికా వెళ్ళుతున్నానంటే మీ నాన్నమాత్రం వొద్దంటాడా? ఇలినాయ్ యూనివర్శిటీలో బ్రహ్మానందం ఉన్నాడు... నెలాఖరునుంచి ఉద్యోగం మానేసి, యిక్కడికి వచ్చివుండు. స్కాలర్ షిప్పూ అవీ నేను చూసుకుంటాను. మీ నాన్నకి ఉత్తరం రాయమంటావా?"

"స్కాలర్ షిప్ నిశ్చయం కానిదే ఉద్యోగం మానేస్తే, నాన్నగారు తప్పుగా భావిస్తారేమో!" అన్నాడు భరతరావు.

"అదంతా నేను చూసుకుంటాను. నీ కెందుకు?" అన్నాడు డాడీ.

కారు దాకా సాగనంపడానికి అరుణాదేవి వచ్చింది.

"ఎందుకు అరుణా మీకు నామీద యింతదయ?"

"ఎందుకో-మీరు అమెరికానుంచి తిరిగి వచ్చిన తర్వాత చెబుతాను" అంది షేక్ హాండ్ యిస్తూ. ఇక్కడ పదివేళ్లూ పెనవేసుకో లేదు; రెండు చేతులూ కలుసుకున్నాయి.

# 8

కొన్ని కలలనుంచి మేల్కొనడం యిష్టం ఉండదు. మనని లేపితే లేపినవారిమీద కసురుకుంటాం. కల కరిగిపోయిందే అని బాధపడతాము. కల అని తెలిసినప్పటికీ, అది కరిగి పోవడం యిష్టంగా ఉండదు. స్వప్నమయ జగత్తులో విహరిస్తూ వాస్తవాన్ని మర్చిపోవాలని తాపత్రయ పడతాము. కలలన్నీ కరిగిపోవడం వాటి ధర్మం. అయినప్పటికీ ఆ కలలు పట్టుకు దేవుళ్ళాడి, వాటికి చిలవలూ పలవలూ కల్పించుకు ఆనందిస్తాము.

"పట్టు శాలువా కప్పుతా నంటే వొద్దనే నిర్భాగ్యుడు వుంటాడా ?" అని ధీమాతో అడిగాడు భరతరావు. కాని ఆ నిర్భాగ్యుడు తనేనని అతనికి తెలీదు. జీవితంలో అవకాశాలు కలగడం ఒక ఎత్తు, వాటిని సద్వినియోగం చేసుకోడం మరొక ఎత్తు. చీలికదారులు కనిపిస్తున్నప్పుడే, మనసు ప్రలోభ పెడుతున్నప్పుడే ఆత్మజ్ఞానం కావాలి. ఆ ఆత్మజ్ఞానం శిక్షణవల్ల వస్తుందా, సంప్రదాయంవల్ల వస్తుందా, పరిస్థితుల ప్రభావంవల్ల వస్తుందా అనేది మనం చెప్పలేము. అది వున్న వాళ్ళు పర్వతశిఖరాలు అందుకుంటారు, లేనివాళ్ళు పాతాళానికి కుంగిపోతారు.

సెక్రెటేరియట్‌లో పనిచేసే ప్రతి గుమాస్తాకీ యిలాటి అదృష్టం పట్టదు; పట్టిన ఆ ఒక్కడూ అదృష్టాన్ని ఎంతవరకు వినియోగించుకున్నాడనేది చూడాలి. చీలికదారులు కనిపిస్తు

న్నప్పుడు మనిషి చేసే నిర్ణయమే అతని జీవిత మార్గాన్ని ఏర్పరుస్తుంది. ఏ దారిని అనుసరించి నడిస్తే, ఎలాంటి పరిణామం వచ్చేదీ ముందుగానే అవగాహన అవుతుంది. ప్రారబ్ధమనేది పాతకాలపు మాట గనక మనిషి తనకున్న బుద్ధి బలాన్నిబట్టి, చీలికదారుల్లో తనకి తోచినదారిని అనుసరించి పోతా డనవలసివస్తుంది. దారిని ఏరుకోవడం నూటికి నూరు పాళ్ళు మనుష్య నిర్ణయం; ఆ పైన సంభవించేది లోక పరిణామం.

నెలాఖరు లోపున రిలీవ్ చెయ్యమని పై అధికారికి అప్లికేషన్ పెట్టుకున్నాడు. డాడీ పూనుకోవడంవల్ల వచ్చే స్కాలర్ షిప్ మీాద, తను తొందరలో అమెరికా వెళ్ళవచ్చునని పూజ్యులైన తండ్రిగారికి రాశాడు; అందుకని ఉద్యోగం మానేస్తున్నానని కూడా తెలియబర్చాడు. అక్కడ తల్లి 'బెండకాయ ముదిరినా బ్రహ్మచారి ముదిరినా' అని మరొకసారి మననం చేసి, అమెరికా వెళ్ళబోయే లోపునే ముడెట్టెయ్యండి అంది భర్తతో. అమెరికానుంచి వచ్చాక కట్నం రేటు పెరుగుతుందని డీప్టీ కలెక్టరు భార్యా రత్నానికి సావధానంగా వివరించి చెప్పాడు. "నువ్వు బుద్ధిమంతుడవని నాకు మొదట్నుంచీ తెలుసు"—అన్నాడు నరసింహంగారు భరతరావుతో.

ఈ ఆనంద స్రవంతికి దూరంగా వున్నది మీనాక్షీ, ఆమె తల్లీను. తను అమెరికా వెళ్దామని అనుకుంటున్నానని మీనా

క్షితో ఒక ఆదివారం వేళ అన్నాడు, ఆమె నిశ్చేష్టురాలైంది.

"అంత తెల్లబోతావేమి! నేను అమెరికా వెళ్ళడం శుభవార్త కాదా?"

"నా కెలా అవుతుంది?" చాపమీద కూచున్న మీనాక్షి కళ్ళవెంట నీళ్ళు జలజల రాలాయి. భరతరావుకి ఏమీ పాలుపోలేదు. ముందు మీనాక్షికి చెప్పి, ఆ పైన మీనాక్షి తల్లికి చెబుదా మనుకున్నాడు. మీనాక్షి తల్లి కూరలకోసమని మార్కెట్‌కి వెళ్ళింది: యింకా రాలేదు; వచ్చే వేళ అయింది.

"అదేమిటి, మీనా!"

"ఏమీ లేదు" అంటూ పైటకొంగుతో కళ్ళు వొత్తుకుంది.

భరతరావు కుర్చీ దిగి చాపమీద కూచున్నాడు.

"అమ్మ వొస్తుంది, పైన కూచోండి."

"అమ్మ వొస్తేనేమి!" అని రెట్టించాడు భరతరావు.

"అలా అనేవారు అమెరికా ఎందుకు వెళ్తున్నారు?"

"స్కాలర్‌షిప్ వచ్చింది. ఎంతకాలంగానో ప్రయత్నం చేస్తున్నాను. నేను అమెరికా వెళ్ళితేమాత్రం మీనాని మర్చిపోగలనా?"

ఆమె శోకవదనంలో ఉషఃకాంత తళుక్కున మెరిసింది.

"ఏదో పిడుగులాటి వార్త వినడంవల్ల గుండె చెదిరింది. కంట తడిబెట్టానని ఏమీ అనుకోకండేం!" ఆ ప్రార్థనలో

స్త్రీ అయి పుట్టడంలోని అసహాయతని విన్నవించింది మీనాక్షి. మబ్బులు మళ్ళిపోయాయి. ఆకాశం నిర్మలమై పోయింది. ఆమె మనసుకూడా తేలికయింది.

తల్లి మార్కెట్ నుంచి వచ్చాక వంట గదిలోకి తీసుకు వెళ్ళి, ఆమె చెవిలో చెప్పింది మీనాక్షి. "ఇవాళ పొద్దున్న ఎవరి మొహం చూశానోగాని ఎంత మంచివార్త విన్నాను, నాయనా!" అంటూ ఏవో ఏవో దేవుళ్ళకి మొక్కింది మీనాక్షి తల్లి. ఈ ఆదివారం తను నికాశమ్ బంగళాకి రానని ముందే చెప్పాడు. తను మీనాక్షిని కలుసుకో గూడదని అరుణాదేవి ఎప్పుడో ఆంక్ష వేసింది, ఆ ఆంక్ష ఆజ్ఞాపూర్వకంగా గాక, తన మేలు మనసారా కోరి చెబు తున్నట్టుగా వేసింది. వాళ్ళ కన్నుగప్పి మీనాక్షిని యిలా కలుసుకున్నాడు భరతరావు.

మధ్యాహ్నం దోసకాయ పప్పువండి, మామిడికాయ పచ్చడి చేశారు. మామూలుగా చారు పెట్టారు. భోజనా లయాక, వాళ్ళిద్దరూ కబుర్లు చెప్పుకోవడానికి వీలు కలిగిం చేందుకా అన్నట్టు, మీనాక్షి తల్లి పక్కవీధికి పెత్తనానికి వెళ్ళింది.

గదిలో మడత మంచంమీద భరతరావుకి పక్కవేసి, పక్క కుర్చీలో మీనాక్షి కూచుంది. తమలపాకులు అతనికి చీల్చి యిచ్చి, తను వేసుకుంది. ఆమె ఎర్రని పెదవులు అతన్ని వూరించాయి.

"తమలపాకులు వేసుకున్నప్పుడు నీ పెదవుల మీద కనిపించే ఎరుపుజీరని నేను అమెరికా కాదు, అంటార్కిటియా వెళ్ళినా మర్చిపోలేను."

"ఏం—అంత బావుంటా నేమిటి, మరీ చెబుతారు గాని!"

"నీ అందం నీ కేమి తెలుసు?"

"మీతో తెలిసినట్టు!"

ఆ ఎత్తి పొడుపులోని గూఢార్థం భరతరావు బుర్రకి అందలేదు.

"మీ ముప్పయి రూపాయలూ మీరు తీసుకోలేదు."

"అవి నీకు ప్రజెంటు చేశా ననుకో."

"పుట్టిన పండగనాడు వుత్తచేతులతో వచ్చారు; ఒక్క బేడ మల్లెపువ్వులయినా పట్టుకు రాలేకపోయారు గాని, మీ ముప్పయి రూపాయిలూ నే నెందుకు పుచ్చుకుంటాను?"

బర్త్ డేనాడు మీనాక్షికి ఏ చిన్న ప్రజెంటైనా కొని యివ్వాలనే యింగితం తనకి లేకపోయినందుకు భరతరావుకి దిమ్మ దిరిగినట్టయింది. కాని సమయస్ఫూర్తితో వొప్పజెప్పాడు; "వుత్తచేతులతో వచ్చానే గాని, నిండు హృదయం నీ కిచ్చానేమో!"

మీనాక్షి పరవశత్వంతో కళ్ళు మూసుకుంది. ఈసారి రాలినవి నిజంగా ఆనంద బాష్పాలే. భరతరావు వాటిని వణికే వేళ్ళతో తుడిచాడు. ఆమె భరతరావు చేతిని రెండు

చేతుల్తోనూ పట్టుకుని, కళ్ళ కద్దుకుందో కళ్ళు మూసుకుందో తెలీదు.

"ఇలా దగ్గిర కూచో" అని మడత మంచం మీద కూచోబెట్టుకున్నాడు మీనాక్షిని.

"ఇవ్వాళ్లా మా యింట్లో వుండిపోరూ?"

"రేపు తెల్లారి ఏడు గంటలదాకా ఉంటాను. సరేనా?"

ఆ రాత్రి మీనాక్షి తల్లికి కలరా సోకుతుందని ఎవరికి తెలుసు? వారఫలితాలు చెప్పే జోతిష్కులు కూడ చెప్పలేరు అలాటి సంగతి. రాత్రి తొమ్మిది గంటలకి వాంతులు ఆరంభ మయాయి. వాంతులూ, విరేచనాలూ—డాక్టరు వచ్చాడు, మందిచ్చాడు. తెల్లారి హాస్పిటల్ కి తీసుకు వెళ్ళేదాకా కూడా ప్రాణి ఆగలేదు. రాత్రి 2-53 కి మీనాక్షి తల్లి యిహబంధాలు తెంచుకు వెళ్ళిపోయింది.

ఇంకో గంటా గంటన్నరకి చచ్చిపోతుం దనగా ఆమె భరతరావుతో అంది : "మీరు ఎవరిని పెళ్ళి చేసుకున్నా, దాన్ని ఒక కంట కనిపెట్టండి బాబూ! దిక్కులేని పక్షి అది" అప్పటికే ఆమె కంఠం జీరవోయింది.

"మీ కిప్పుడొచ్చిన భయమేమీ లేదు. తెల్లారే టప్ప టికి నింపాదిగా ఉంటుంది" అన్నాడు భరతరావు మనో ధైర్యం చెబుతూ.

2-53 కి పక్కింటి పెరుమాళ్లు అంతా అయిపోయిందని ముఖంమీద గుడ్డ కప్పాడు. మీనాక్షి, భరతరావు వాళ్ళో

పడి భోరుభోరున ఏడ్చింది. కాకులు కూసేదాకా మీనాక్షి ఏడుస్తూనే వుంది. భరతరావు వూరుకోబెడుతూనే వున్నాడు.

అంత్యక్రియలు జరిగిపోయాయి. బిందు మాధవరావూ, సెక్రటరీ ఒకసారి వచ్చి చూసి పోయారు. బంధువు లంటూ ఎవరున్నారు గనక తెలియపర్చేందుకు? దారిద్ర్యంవల్ల అన్ని బంధాలు ఏనాడో తెగిపోయాయి. చిత్తూరులోవున్న ఉమా పతి ఒక్కడికి ఉత్తరం రాశారు.

మీనాక్షి భవిష్యత్ అతి భయంకరం. నిన్నసాయంత్రం ఈపాటికి అమ్మ బంగాళాదుంపలూ, ములక్కాడలూ మార్కెట్‌నుంచి తీసుకు వచ్చింది. ఇప్పుడిక ఆమె లేదు. సాయింత్రం నాలు గయింది. పొద్దుటినుంచి పచ్చి మంచి నీళ్ళయినా ముట్టలేదు మీనాక్షి. ఇంకో రెండు గంటలలో చీకటి పడుతుండంటే ఆమెకి విపరీతమైన భయంగా ఉంది. ఇరుగూ పొరుగూ అడపా దడపా వచ్చి పల్కరించి పోతున్నారు.

“మీనా, కాస్త కాఫీ అయినా తాగు. నా మాట విను మరి. మనం మాత్రం యిక్కడ శాశ్వతంగా ఉంటామా? ఎవరి టైము వచ్చినపుడు వాళ్ళు వెళ్ళి పోతారు. మరి నువ్వు తాగకపోతే నేనూ తాగను” అన్నాడు భరతరావు. ఆమెకు వివేకం నూరిపోస్తూ.

“మీరు తాగండి.”

“ముందు నువ్వు తాగు. ఆ పైన నేను తాగుతాను.”

రెండు చేతులూ అతని మెడకి పెనవైచి, గుండెలమీద తల పెట్టుకు పెద్ద పెట్టున ఏడిచింది.

"ఏడవకు, కాఫీ తాగు" అని సముదాయించాడు భరతరావు.

భరతరావుకోసం మీనాక్షి గ్లాసులో సగం కాఫీతాగింది. మిగతా సగమూకూడా బలిమాలుకు తాగించాడు.

ఆ రాత్రి పెరుమాళ్ళూ ఆయన భార్య వారికి సాయంగా యింట్లో పడుకున్నారు. భరతరావు చేతిని గట్టిగా పట్టుకు, కలత నిద్రపోయింది మీనాక్షి ఆ రాత్రి.

రెండు రోజులు గడిచింది. బట్టలకోసం ఒక్కసారి తన గదికి వెళ్ళి వచ్చాడు—భరతరావు—అంతే అదైనా ఒక గంటసేపు. మిగతా వేళల ఆమెని అంటిపెట్టుకునే వున్నాడు.

"ఇక ముందు గతేమిటి?" అంది మీనాక్షి.

"నే నుండగా నీకు ఆ ఆలోచన ఎందుకు?"

"మీరు అమెరికా వెళ్ళరూ?"

"నిన్ను యిలా వొదిలి అమెరికా వెళ్తానా?"

"అదేమిటండీ—నా కోసం మీ భవిష్యత్ పాడు చేసుకుంటారా?"

మీ అమ్మకి మరణ శయ్యమీద మాట యిచ్చాను. నిన్ను కనిపెట్టే భారం నాది. ఆ బాధ్యత సంతోషంతో స్వీకరిస్తాను."

"నేను మీ పాలిట శనిదేవతలా చుట్టుకున్నట్టున్నాను."

"అవేం మాటలు !" అని గదమాయించాడు భరతరావు.

నరసింహంగారు భరతరావుని గది ఖాళీ చెయ్యమన్నాడు. డిప్టీ కలెక్టరు ధూములు ధాములు చేశాడు; డాడీ యిప్పించే స్కాలర్‌షిప్ గంగపా లయింది. భరతరావు కలలన్నీ మీనాక్షి తల్లి పార్సెల్ కట్టి పరలోకానికి పట్టుకుపోయింది.

తల్లి చనిపోయి నెల్లాళ్ళయిన తర్వాత, ఒక సాయంత్రం జాజులు కొని తలలో పెట్టుకుంది మీనాక్షి. ఆ రాత్రి వారి వలపు పండింది.

# 9

భరతరావు మీనాక్షి యింట్లో బైఠాయించి కూచున్న ఈ నెల్లాళ్ళలోనూ బోలెడంత గ్రంథం జరిగింది. మీనాక్షి తల్లి చనిపోయిన సందర్భంలో అతను లీవ్ లెటర్ లేకుండా రెండు రోజులు ఆఫీసు ఎగగొట్టాడు. అంతకి క్రితమే తనని రిలీవ్ చెయ్యమని దరఖాస్తు పెట్టుకున్నప్పటికీ, రెగ్యులేషన్సుకు వ్యతిరేకంగా మానేసిన కారణాన పై అధికారి సంజాయిషీ అడిగాడు, అమెరికా సంగతి అస్తావిస్తుగదా అని, ఉన్న ఉద్యోగం నిలుపుకునేందుకు భరతరావు తంటాలు పడ్డాడు; కాని అతని ప్రయత్నం ఫలించలేదు. "డిస్‌మిస్ చెయ్యను—రాజీనామా ఉత్తరం యియ్యి" అని పై అధికారి అడిగాడు. అంతా మసిపూసి మారేడు కాయ అయింది.

ఒకటో తారీఖు సాయంత్రం తన కడపటి జీతం పట్టు కొచ్చి మీనాక్షి చేతులలో పోశాడు భరతరావు. "కూలిన సౌధాల" గురించి విచారించ కూడదని మనసు దిట్టం చేసుకున్నాడు. అరుణాదేవికి "కట్టిన మేడలు" వుండవచ్చు; తనూ మీనాక్షీ కలిసి మేడ కట్టుకోవచ్చుగదా! వారసత్వం అనుభవించడంకంటె శ్రమపడి సంపాయించడంలోని ఆనందం తనకి తెలియనే తెలుసు.

మీనాక్షి తల్లి చనిపోయిన వారం రోజులకి ఉమాపతి వొచ్చి, రెండు రోజులు వుండి వెళ్ళాడు. బిందుమాధవరావు మట్టుకు నాలుగు రోజులకీ మూడు రోజులకీ ఒకసారి వస్తూ, ఆ మాట్లాడ దలుచుకున్న నాలుగు ముక్కలూ భరతరావుతోనే మాట్లాడి వెళ్ళిపోయేవాడు. మీనాక్షిని పలకరించేందుకు కూడా ప్రయత్నించేవాడు కాదు. ఇంకొకరి సొత్తుగదా అని సరిపెట్టుకున్నాడో ఏమో?

మీనాక్షి మెళ్ళో రెండుపేటల గొలుసూ, చేతికి మూడుజతల గాజులూ వున్నాయి. యింట్లో రెండు వెండి కంచాలూ రెండు వెండిగ్లాసూలు వున్నాయి—అదే వారి ఆస్తి. పైకం నూటనలభై రూపాయిలు కాబోలు ఉంది— భరతరావు పట్టుకొచ్చిన ఆఖరు జీతంతో కలిపి.

ఏకశయ్య ఏర్పాటై వారం రోజులు గడిచిన మీదట మీనాక్షి అంది ఒక సాయింత్రంవేళ పూలుగుచ్చుకుంటూ; "ఇక యిల్లు గడిచేమార్గం ఆలోచించుకోవాలి మనం'

మీరు మరొక ఉద్యోగ మేమయినా చూసుకోండి. మీదా న్నయినమీదట నేను స్టేజి ఎక్కితే మీకు అప్రతిష్ఠ.''

''ప్రతాపరుద్రీయం'' యింకో పాతిక పేజీలు ఉంది. ఇన్నాళ్ళబట్టీ భరతరావు చేస్తున్న పని యేమిటంటే: మీనాక్షీ యింట్లో వున్న నాటకా లన్నీ చదవడం. వెనక ఏ టెక్స్ట్ బుక్కులో చదివి, టెన్నిస్ ఆడి, బి. యె. పాస య్యాడు. అంతేగాని సాహిత్య సారస్యాతా లేమిటో భరత రావుకు తెలియదు. మీనాక్షి యింట్లో అరవై డెబ్బయి నాటకం పుస్తకాలు తెలుగువి వున్నాయి. గయో పాఖ్యానం, సతీ తులసి, పాండవోద్యోగ విజయాలు, సత్య హరిశ్చంద్ర, నలదమయంతి, భక్త రామదాసు, భక్త కబీరు, రంగూన్ రౌడి, సక్కుబాయి—ప్రఖ్యాత తెలుగు నాటకాలన్నీ ఆ దొంతరలో ఉన్నాయి. అవన్నీ మీనాక్షి మేనమామ కొని పడేశాడు. మీనాక్షి అప్పు డప్పుడు చదువుతూ వుండేది గాని యింత శ్రద్ధగా ఏనాడూ చదవలేదు. పొద్దున్న ఒక నాటకం, సాయంత్రం ఒక నాటకం భరత రావు చేతుల్లో కనపించడం ఆమెకూడా వింతగానే తోచింది.

పుస్తకం మూసేసి భరతరావు అన్నాడు; ''అప్రతిష్ఠ ఏమిటి? ఆ మాట అనకు. నువ్వు సహజంగా నటివి; ఎంతో కష్టపడి నేర్చుకున్నావ్. నా కోసం నువ్వు నీ సమర్థతని మంట గలపకూడదు.''

"అది కాదండి, ఇన్నాళ్ళూ వేరు యిప్పుడు స్టేజి ఎక్క డం నాకే బెరుకు బెరుకుగా ఉంటుంది."

"ఆ బెరుకు బెరుకుగా ఉండటం పోగొట్టుకోవాలి. పోయిన మర్యాద ఎలాగూ రాదు. అందుకని పదిమంది కోసం బతుకుదాము."

భరతరావు నాలుగు రోజులబట్టీ లోలోన ప్లాను వేస్తు న్నాడు ఒక చిన్న ట్రూప్-తనూ, మీనాక్షీ, ఉమాపతి. పెద్ద పెద్ద నాటకాలు గాక చిన్న చిన్న నాటకాలు వెయ్య డం, లేదా మంచి నాటకాలలోని ముఖ్య ఘట్టాలు ప్రదర్శిం చడం. ఉమాపతి తమతో కలిసిపోతాడు. పెద్దవాడు, ఏదో అండగా కూడా ఉంటాడు. ఈ ట్రూప్‌కి మూలధన మంటూ అక్కర్లేదు. రెండో మూడో రంగు తెర లుంటే చాలు. భరతరావు బుర్రలో గాలిమేడలు ఒక టొకటే లేచాయి. ఒకనాడు అరుణాదేవికూడా మీనాక్షి పేరు ప్రఖ్యాతులు చూసి అసూయ పడుతుంది. తనని రాజీనామా పత్రం యిమ్మని నిలవదీసిన అధికారికి బుద్ధి చెప్పిన ట్లవుతుంది. తనేదో చెడిపోయాడని అనుకున్నవాళ్ళందరికీ చెంపపెట్టు అవుతుంది.

మనసులోవున్న ఆలోచన మీనాక్షికి వివరించి చెప్పాడు భరతరావు. "ప్రజల్ని ఉత్తేజపరిచే చక్కటి నాటకాలు ప్రదర్శిద్దాం. కమ్మటి వినోదంద్వారా వారిని చకితులుగా చేదాం. డబ్బు అంటావా? లోకం అంత చెడ్డది కాదు.

తిండి లేక మనం చావము. కాలేజీల్లో, క్లబ్బుల్లో, స్కూళ్ళలో, గ్రామసీమల్లో మన ప్రదర్శన లిద్దాము. ప్రేక్షకుల్ని బట్టి నాటకాలు మారుద్దాం. క్లబ్బులో "సతీ అనసూయ" చూడరు; పల్లెటూళ్ళో "విప్లవ స్త్రీ"ని చూడరు. అందుకని ఎవరి కేమి కావాలో, మనం ఏరుకుని అట్టే పెట్టుకోవాలి. నువ్వూ, నేనూ, ఉమాపతీ—ముగ్గురమంటే ముగ్గురమే. ఆంధ్ర దేశంలోని పల్లె పల్లెల్లోనూ మన పేరు చెప్పుకోవాలి."

"ఎందుకండి అంత ఉత్సాహం! మీ కెందుకు పుట్టింది యిలాంటి బుద్ధి! చాలా తమాషాగా ఉంటే! కానీండి—మీ యిష్టం."

"చూడు—మీనాక్షీ, ఈనాడు ప్రజలు ఉపన్యాసాలు వినలేక చచ్చిపోతున్నారు ఒక్కొక్కడు ఒక్కొక 'ఇజమ్' పట్టుకు ప్రజలకి ఊపి రాడనివ్వడం లేదు. ఎవడి వెర్రి వాడిదే గాని మరొకడి మాట వినిపించుకోవడం లేదు నాయకులు. ప్రజానీకంలో కలకలలాడే మొహాలు కరువయాయి. ఒక్కడూ హాయిగా నవ్వ లేకుండా ఉన్నాడు. ఏదో ఉప్పెన వచ్చి మీద పడుతున్నట్లు ప్రతివాడూ దిగాలుపడి కూచున్నాడు. ప్రతివాడికీ జీవన సంగ్రామ భయమే. ఈ ప్రజల్ని ఒక్కసారి నవ్విస్తే—నవ్వించ గలిగితే! మనం ముగ్గురమూ కలిసి ముక్కోటి ఆంధ్రుల్నీ పక పక నవ్విద్దాం."

"ఏమో బాబూ—అవన్నీ నాకు తెలియవు మీరు చెప్పినట్లు చేస్తాను."

"ఈ నెల్లాళ్ళబట్టీ వీధి మొహం చూడక పుస్తకాలతోటీ వార్తాపత్రికలతోటీ గడపడంవల్ల ఎన్నో విషయాలు తెలియ వచ్చాయి. నేను చెబుతున్నది కొత్త సంగతికాదు. నాలో నిద్రాణంగావున్న ఒక శక్తి మేల్కొని యిలా పలికింప జేస్తూంది."

"అంబ పలుకుతోందా, అంబికేశుడు పలుకుతున్నాడా?" అని నవ్వేసి వూరుకుంది మీనాక్షి.

భరతరావు తన ప్లాను విషయమై చాలా సీరియస్‌గా వున్నాడు. మర్నాడు బిందు మాధవరావు వచ్చినప్పుడు ఆయన ముందు ఈ ప్రస్తావన తెచ్చాడు.

"భేషుగ్గా ఉంటుంది. మీనాక్షి పేరు మంత్రమై మ్రోగు తుంది. నేను కొన్ని మోడరన్ వన్ యాక్ట్ ప్లేస్ పంపిస్తాను-మీకు ఉపయోగపడతాయేమో చూడండి. పిలిచినా పిల వకపోయినా మొదటి పెర్‌ఫారమెన్స్‌కి బిందుమాధవరావు కూడా వస్తాడు. ఒక్కమాట-మీరు ఏమీ అనుకోరనే స్వతంత్రతతో అంటున్నాను. మీకేదయినా పైకం కావలిస్తే, వెయ్యి రూపాయలదాకా సర్దగలను" అన్నాడు బిందుమాధవరావు.

"మీఅభిమానం ఉంటే చాలు. పైకం ఏమీఅక్క ర్లేదు" అన్నాడు భరతరావు.

మనిషి పరిసరాల బానిస. ఆ పరిసరాల్నిబట్టి నీతి నియ మాలూ, ప్రతిష్ఠాప్రతిష్ఠలూ ఏర్పరుచుకుంటాడు. మనిషిలో

అగ్నిశిఖ జ్వలింప చేసేందుకుగానీ హిమపాతం పుట్టించేందుకు గానీ పరిసరాలే కారణ మవుతున్నాయి. పరిసరాలకి అనుగుణంగా బతక నేర్చిన వానరుడే నరుడయ్యాడు. వీడి యోాక్రటీనుంచి దభీమని ఒక చీకటికొట్లోకి వచ్చిపడ్డాడు భరతరావు. ఆ చీకటికొట్లోకి ఒక సన్నటి కాంతి కిరణం ఏ మూలనించో వచ్చి పడుతోంది. ఆ వెలుగుకి సూటిగా ఎగరగలిగే ఖేచరగమనం తనకి కావా లనుకుంటున్నాడు. తరిచిచూస్తే అది చీకటికొట్టు కాదేమో అనిపిస్తుంది. ఎందుకంటే ఆ చీకటికొట్లో ఆముదపు దీపం వెలిగించేందుకు ఒక సుందరాంగి ఉంది.

భరతరావుకి అనుమానాలు లేవు-అన్నీ ఆశలే. తన ప్రయత్నానికి విజయం చేకూరక తప్ప దనుకున్నాడు.

ఉమాపతి తన రోజులు వీరిద్దరితోనూ గడుపుకునేందుకు చాలా సంతోషించాడు. ఎటొచ్చీ అతనికి ఈ స్కీము ఆర్థికంగా గిట్టుబా టవుతుందని నమ్మకం లేదు; కాని అడ్డు పుల్లలు వెయ్యలేదు.

"భరత-మీనాక్షి" తమ మొదటి ప్రదర్శనం బెజవాడ క్లబ్బులో యిచ్చారు. ఆవేళ బిందు మాధవరావు కూడా ఉన్నాడు. కొందరు మెంబర్లు పేకాడుతూనే ప్రదర్శన చూశారు; కాని మధ్యలో షేకముక్కల సంగతి మర్చిపోయారు. గుంటూరు, తెనాలి, ఏలూరు క్లబ్బులలోకూడా అదే ప్రదర్శన యిచ్చారు. అన్నిచోట్లా పేక ఆడుకునే మెంబర్లు మధ్యలో పేకముక్కల సంగతి మర్చిపోయారు.

టికెట్లు లేవు. ఎవరికి తోచినది వారు డబ్బాలో వెయ్యడమే ఆ డబ్బా పుచ్చుకు ఎవరూ వెంట పడరు. అది గేటు దగ్గిర చిన్న టేబుల్ మీద ఉంటుంది. ఈ కళాకారులకి తిండీ బట్టా కావాలనే యింగితం వున్నవారు తృణమో పణమో అందులో పడేస్తారు; లేనివారు చేతులు వూపుకుంటూ పోతారు. అంతేగాని బీడీముక్కలూ, మారని డబ్బులూ, లవ్ లెటర్సూ ఆ డబ్బాలో ఎవరూ పడెయ్యలేదు.

నాలుగుచోట్ల వరసగా ప్రదర్శనలు యిచ్చేటప్పటికి, ఈ తిరుగుడుకీ వాటికీ అలవాటు లేదేమో, ముగ్గురూ డస్సిపోయారు. బెజవాడలో ఒకపూట ఆగి, మద్రాస్ వచ్చి డబ్బా తెరిచి చూసుకుంటే 187 రూపాయిల చిల్లర ఉంది. వందకూడా ఉండదేమో అన్నారు ఉమాపతీ, మీనాక్షి.

"వంద వుంటే ఖర్చులు వచ్చినట్టు, సెట్టి మిగులుతాడు" అన్నాడు భరతరావు డబ్బా తెరవడానికి ముందు.

187 రూపాయిలు ఉంది. అందులో మూడు పదిరూపాయలనోట్లూ, పదకొండు అయిదురూపాయల నోట్లూ వున్నాయి. మిగతాది చిల్లర.

తమ ప్రదర్శన జయప్రదమవడంతో భరతరావుకి ధైర్యం చిక్కింది. ఈ సారి ప్లాన్డ్‌గా చెయ్యాలనుకున్నాడు. నెలకి పదిహేను రోజులు టూర్ చేసి, పదిహేను రోజులు విశ్రాంతి తీసుకోవాలి. ప్రోగ్రాం ముందే ఏర్పాటు చేసుకోవాలి. వారికి కావలసింది క్లబ్బులూ, స్కూళ్లూ, రచ్చబండలూ,

నాలుగు నెల లయేటప్పటికి "భరత-మీనాక్షి" హైర్ పర్చేజ్ సిస్టమ్‌మీద చిన్నవాన్ ఒకటి కొంది. తెరలూ, మేకప్ సామానూ వాటిలో వేసుకు ఊర ఊర పోవడం, డ్రయివర్ కూడా వాళ్ళకు తగినవాడే దొరికాడు, అవసర మైతే చిన్న చిన్న పాత్రలు అతనూ వేసేవాడు.

మీనాక్షి భరతరావులకు యిదొక మహత్తరానుభవం. బాల బాలికలూ, పల్లెప్రజా చూపే ఆదరాభిమానాలకు వారి కళ్ళు చెమర్చేవి. కళకి పోషణ లేదనడం కల్ల అనీ, ఆ కళని ప్రజాహృదయం దగ్గరకి తీసుకువెళ్ళడం నేటి కళా కారులకి తెలీదనీ వారు నిశ్చయాని కొచ్చారు.

పత్రికలలో వారి బొమ్మలు పడుతున్నాయి, సంస్థలు వారి కళాసేవని కొనియాడుతున్నాయి; ప్రజలు చేయెత్తి నమస్కరిస్తున్నారు వారికి; కీర్తి అంటే ఏమిటో యిద్దరికీ తెలియవచ్చింది.

# 10

కీర్తివచ్చి ధనం రాకపోతే చాలా కష్టం . కీర్తికంటె ముఖ్యమయినది ధనం. ఈ ధనమదాంధలోకంలో, కీర్తివుండి ధనం లేనివారు, తమ కీర్తికి ఖరీదుకట్టి అంతో యింతో తమ మొహాన్ని పారెయ్యండని క్యూలో నుంచుంటారు. అలాంటిది మీనాక్షీ భరతరావులకు కీర్తి వచ్చింది. అపరిమిత మైన కీర్తి వచ్చింది. డబ్బు మాత్రం ఏ నెల కానెల తడుము కోవడమే అవుతోంది.

వాన్ మీద కట్టవలసిన యిన్‌స్టాల్‌మెంట్సు కట్టడం ఏ నెల కా నెల గడమే అవుతోంది. అడపా దడపా బిందు మాధవరావు సాయపడుతూ వుండేవాడు. అతను మునుపటికి మల్లే గాక పూర్తిగా మారిపోయాడు. వందా, రెండొందలూ భరతరావు ఆయన దగ్గిర తీసుకు మళ్ళీ వాపసు చేస్తూండే వాడు. బిందుమాధవరావు భార్యా, మరో అమ్మాయికూడా మీనాక్షిని చూడటానికి అప్పుడప్పుడు వస్తూ వుండేవారు. మీనాక్షికూడా భరతరావుని వెంటబెట్టుకు వారి యింటికి వెళ్తూండేది.

కీర్తివచ్చి ధనం రాకపోతే సంభవించే యాతన వీరికి పట్టుకుంది. రెండేళ్ళు ప్రజలకి వినోదాన్ని రెండు చేతులా పంచిపెడితే, వారికి మిగిలినది డొక్కుయిపోయిన ఒక చిన్న వాన్; దానికీ టైర్లు మార్చాలి. ఈ రెండేళ్ళ సంపాదనకీ ఫలితం అదొక్కటే. అయినా వారికి చింతలేదు. 99 ప్రద ర్శనలు ఆంధ్రాలో యిచ్చి, నూరవది మద్రాస్ మ్యూజి యమ్ థియేటర్‌లో యిచ్చారు. ఆనాడు పురప్రముఖులు వారిని స్తుతిపాఠాలతో సిగ్గుపడేటట్టు చేశారు.

100 వ ప్రదర్శన అయిన తర్వాత పదిహేను రోజులు హాలీడే అనుకున్నారు. హాలీడేకి బెంగుళూరు వెళ్దామని మీనాక్షి ప్లాను వేసుకుంది; "హాలీడే కాదు. ప్రదర్శన యిచ్చేందుకయితే వెళ్దాం పద" అన్నాడు భరతరావు.

"ఎక్కడికీ వద్దు. యింట్లోనే కూచుందాం" అని తేల్చాడు ఉమాపతి.

ఉన్నట్టుండి ఉమాపతికి ఉబ్బసం ఎక్కువయింది. ఉబ్బస వ్యాధి అతనికి చాలా కాలంబట్టీ ఉంటోంది. ఈ సీజన్‌లో ఎందుకో ఎక్కువయింది. నెల్లాళ్ళు పక్క వేసాడు. తమని నమ్ముకున్న పెద్దవాణ్ణి వొదిలేస్తారా మీనాక్షీ భరతరావులు? మదనపల్లి తీసుకువెళ్ళారు. అక్కడొక పది రోజులు వున్నాక, "ఈ అవతారం యింక చాలు" ననుకున్నాడు ఉమాపతి.

ఉమాపతి మాట్లాడుతూ మాట్లాడుతూ చచ్చిపోయాడు. అతని బెడ్‌కి చెరోవైపునా యిద్దరూ కూచున్నారు. ఉమాపతి తల వొరిగి పోగానే, మీనాక్షికి పెద్ద పెట్టున ఏడుపు వచ్చింది. అంత గట్టిగా ఏడవకూడదని వారించింది నర్సు.

మొట్టమొదట తల్లి, తర్వాత ఉమాపతి—మీనాక్షి తన వాళ్ళు అనుకున్న యిద్దరూ వెళ్ళిపోయారు. తను ఒక్కతే మిగిలింది. భరతరావు దేవుడల్లే ఆదుకున్నాడు గనక గాని లేకపోతే తను ఏమై ఉండేది! జీవిత మెందు కింత దుఃఖ భాజనంగా కనిపిస్తుంది? అందరికీ యింతేనా, తనకేనా?

ఆ రాత్రి మీనాక్షి చంటిపిల్లలా వొదిగి పడుకుంది భరతరావు దగ్గిర. భరతరావుని మాత్రం యిలాంటి సంఘటనలు కలిచివెయ్యవూ? కాని అతను మొగాడు కనక ఆడదానికి ధైర్యం చెప్పాలి. ఆ రాత్రల్లా వులికి పడుతూనే వుంది మీనాక్షి. తెల్లారి అయిదు గంటలదాకా భరతరావు కన్ను ముయ్యలేదు.

స్వల్పమయినప్పటికీ సువిశాలంగా తోచే ఈ శుష్క మానవ జీవితంలో మనకు సన్నిహితులైనవారి మరణాలు మైలు రాళ్ళలా కనిపిస్తూ వుంటాయి. ఇద్దరికీ ఈ రెండే చావులు తెలుసు. కాని ఆ రెండూ చాలవూ వారిని హడల గొట్టేందుకు!

వారం రోజులపాటు చెయ్యి విరిగినట్టు బాధ పడ్డారు యిద్దరూ. యిల్లూ, వెచ్చాలూ, అద్దె, పాలవాడు! బిందు మాధవరావు దగ్గిర మరొక వంద తీసుకో వచ్చును. కాని, యివ్వాళ కాకపోతే రేపయినా తీర్చవలసిందేగా.

ఉమాపతి చనిపోయాడని తెలిసి రమాకాంతం తనకి తానుగా వచ్చాడు. ఆయ నెవరో భరతరావుకి తెలియక పోయినా, మీనాక్షికి తెలుసు. తమతో పాటు భోజనం, నెలకి యింత జీతం—యిత్యాదులు మాట్లాడుకున్నారు. వెనక ఉమాపతికి జీతమంటూ లేదు.

రమాకాంతం కూడా కలుపుగోలు మనిషి, ఉమాపతి అంత మంచివాడు గాకపోయినా, కంపెనీ వుంటేనే తనకి జీతం ఉంటుంది కనక, కంపెనీ నిలబెట్టాలని త్రికరణశుద్ధిగా పాటుపడేవాడు.

వెంకట్రాజుపాలెంలో కాబోలు "నీలితెరలు" అను నాటకం వేస్తున్నారు. గంటన్నర నాటకం—సాయంత్రం అయిదున్నరనుంచి ఏడుదాకా, అది అయిపోయిన తర్వాత ఒంగోలు చేరుకుని, అక్కడ ఒక సంపన్న గృహస్తుని

యింట్లో జరుగుతున్న వివాహ సందర్భంలో రాత్రి 10-30 కి భోజనాలానంతరం చిన్న హాస్యప్రదర్శనం—నలభై నిముషాలది—యివ్వాలి.

వెంకట్రాజుపాలెం ప్రజలు నాటకం కంపెనీ వారికోసం కంకరతోలే లారీలు రెండు సప్లయి చేశారు. ఆ రెండు లారీలూ ఎదురు బదురుగా ఉంచి, చక్కటి స్టేజి పది నిముషాలలో ఏర్పాటు చేశారు. మేకప్ పది నిముషాల పని, నాటకం యింకో అయిదు నిముషాలకి ప్రారంభ మవుతుం దనగా, ఎక్కడ నుంచి వూడిపడ్డాడో విశాశమ్ వచ్చాడు.

భరతరావు అతన్ని చూసి ఖంగారు పడలేదు గాని ఆశ్చర్యపడ్డాడు. ఆ తర్వాత, మీనాక్షిని పరిచయం చేశాడు.

"విశాశమ్ అంటే అరుణాదేవి అన్నగారు కదూ?" అంది సహజనటి అయిన మీనాక్షి. ఆమె విశాలనేత్రాల వశీకరణ శక్తికీ విశాశమ్ కాస్త వెలవెల పోయాడు.

"అబ్బాయ్! నేనొక ముఖ్యమైన పనిమీద వచ్చాను. "సిలితెరలు" నాటకం యిక్కడ వెయ్యవద్దు. మరొకటి వెయ్యి" అన్నాడు భరతరావుని ఉద్దేశించి.

"దానిమీద ప్రభుత్వ అంక్షలేదుగా?"

"ఈ ఊళ్ళో మా మామయ్య మోతుబరి రైతు. 'నీ ప్రదర్శనలో ఒక మోతుబరి రైతు కొడుకు కాపు లమ్మాయిని పెళ్ళి చేసుకోడం ఉందటగా?"

"అవును. ఆ అమ్మాయీ, ఆ అబ్బాయీ పక్క పట్నంలో ఒకే కాలేజీలో చదువుకున్నారు. మోతుబరి రైతుగారు బతికి చెడ్డ కాపు ఆస్తిని జప్తు చేయించబోగా, అతని కొడుకు ఇతని కూతురికి దేవుడు గుళ్ళో మంగళ సూత్రం కడతాడు. అదీకాక యిది హాస్యరూపకం. భూ విధానం గురించీ, రైతులకి జరిగే అన్యాయాల గురించీ యిందులో ఒక్క ముక్క లేదు."

"నీలితెరలు అంటే?" అన్నాడు విశాళమ్.

"నీలంగా వుండే తెరలు, నీలంరంగు కర్టెనులు ఆఅమ్మాయికి యిష్టం కనక అబ్బాయి కూడా అలాటివే తన గది కిటికీకి కొట్టుకుంటాడు. "మనకి బంతిపువ్వు రంగు పట్టుతెరలు వుండగా నీలంరంగు నూలు తెరలెందుకు?" అని తండ్రి అడిగితే, తనకి నీలమే కావాలని పట్టుబడతాడు కొడుకు. ఆ కాపులమ్మాయి పేరు నీలవేణి" అంటూ భరతరావు చెప్పుకు పోయాడు.

"సరేలే, మా మామయ్య కటికి దుర్మార్గుడు ఏమైనా అల్లరి జరుగుతుందేమో జాగర్త."

"చిట్టచివరికి దేశం యిలా అయ్యిందా! హాస్యనాటక మాడటం కూడా నేరమయిందా! కానీ, ఏం చేస్తాడో చూస్తాను మీ మామ! యిక్కడికి పోలీస్ స్టేషన్ ఎన్ని మైళ్ళలో ఉంది."

"ఆరు మైళ్ళు."

భరతరావు పోలీస్ స్టేషన్ కి డ్రయివర్ని పంపిద్దా మను కున్నాడుగాని అది తన పిరికితనాన్ని సూచిస్తుం దేమోనని మానేశాడు. వికాశమ్, తాను ప్రదర్శన చూడదలుచుకున్నా నని ముందు వరుసలో కూచున్నాడు.

ప్రజలకి ఈ తెర వెనక భాగోతం తెలీదు. ఆ కాపువాళ్ళ వెంకయ్యన్న, ఆ మోతుబరి రైతు వాళ్ళ సింగరాజూ అవడంవల్ల నాటకం చాలా రక్తి కట్టింది. మూడు గంటలు నాటకమయింది. 'షాలో' మని ఒక పక్కనుంచి పెద్ద పెద్ద కేకలు వినిపించాయి. ప్రదర్శనం చూస్తున్న ప్రజలు స్టేజి వెనకకి వస్తున్న గుంపుమీద దూకారు. అది చెలరేగిన జన సమూహం, మీనాక్షిని ఒక చేత్తోనూ, భరతరావుని ఒక చేత్తోనూ పట్టుకుని బరబర ఈడ్చుకుపోయాడు వికాశమ్. వారిని ఒక గదిలో పది నిమిషాలు ఉంచి, ఒకటో రకమైన జట్కా బండిమీద, పక్క రైలు స్టేషన్ కి పంపించాడు. తమ కష్టార్జితమైన వాన్ భగ భగ మండిపోవడం చూశారు మీనాక్షీ, భరతరావులు. జట్కాలోకి ఆ మంటలు కొట్టొచ్చి నట్టు కనిపించాయి. ఆ మంటలు చూస్తూ యిద్దరూ ఒకళ్ళ నొకళ్ళు కౌగలించుకుని ఏడ్చారు. జట్కాబండి సాయిబు తలకి చుట్టుకున్న తువ్వాలుతో కంటి తడి తుడుచుకున్నాడు.

అయిపోయింది. ఒక అధ్యాయం ముగిసిపోయింది. భరత రావుకి యిన్నాళ్ళబట్టీ ప్రజలమీద ఎంత ప్రేమో ఈ క్షణంలో అంత అసహ్యం కలిగింది. ఈ మనుషులు—

పందులూ, కుక్కలూను. వాళ్ళకి వినోదమూ, లలిత కళలూ ఎందుకు? యావజ్జీవ బానిసత్వానికే వారు అర్హులు. ఈ పశువులకోసం తానూ మీనాక్షీ రెండేళ్ళు రక్తకన్నీరు కార్చారు. ఎంతో ఆనందంతో తమ జీవిత కుసుమాలు వారికి నైవేద్యం చేశారు.

క్రోధాగ్నితో భయంకరంగా వున్న భరతరావు మొహం లోకి హిమబిందువులు చిలకరిస్తున్నట్టు చూసి, "ఇవ్వాళ లేచిన వేళా విశేషమది. ఇంతవరకూ అదృష్టవంతులమేగా!" అంది మీనాక్షి.

తన కోప తాపాలకీ, ఆమె శాంతి వచనాలకీ సమైక్యత తలపోస్తున్నాడు భరతరావు. అతను బొటబొట రాల్చిన కన్నీళ్ళని పైటకొంగుతో తుడిచి, అతని తల తన తొడ మీద పెట్టుకుంది మీనాక్షి. భరతరావు ఆరాటం కొంత తగ్గింది.

పాపం! రమాకాంతాన్ని హాస్పిటల్ చేర్చారు. అతని మోచెయ్యి విరిగింది. తలమీద కూడా గాయాలు తగిలాయి. డ్రయివర్ తుప్పలలోకి పారిపోయి, రాత్రి వొంటిగంటకి బయటికి వచ్చి, పక్కగా పడివున్న మేకప్ పెట్టె పట్టుకు, మద్రాస్ చేరుకున్నాడు.

కేసు జోరుగా సాగింది. మంత్రులు తనవారని విర్రవీగిన సింగరాజుని ఏ మంత్రీ రక్షించ లేకపోయాడు. జడ్జి సాక్ష్యాన్ని పరిశీలించి, సింగరాజుకి ఒక సంవత్సరం జైలుశిక్ష విధిం

చాడు. అతనికి ఈ దొమ్మీలో సాయపడ్డ మరి యిద్దరికి కూడా అదే శిక్ష విధించాడు. కారు తగలబెట్టించి నందుకు మీనాక్షీ, భరతరావులకి పది వేలూ గాయపరిచినందుకు రమాకాంతానికి మూడు వేలూ యివ్వవలసిందని కోర్టువా రన్నారు. సింగరాజు దగ్గిర నగదు పైకం లేనిపక్షంలో, ఈ పదమూడు వేల నష్టపరిహారమూ సింగరాజు ఆస్తి వేలం వేయించి, పదిహేను రోజులలో రాబట్టుకొమ్మని కోర్టువా రన్నారు. ముఖ్యంగా మేనల్లుడు వికాశమ్ యిచ్చిన సాక్ష్యం సింగరాజు కొంప ముంచింది. జడ్జి తన జడ్జిమెంటులో మీనాక్షీ భరతరావులు ప్రజలకి తిండీ బట్టే కాకుండా వినోదం కూడా అవసరమనే సత్యాన్ని గుర్తించి, యితర కళాకారులు చెయ్యలేని మహోన్నత ప్రజాసేవ చేస్తున్నారు గాబట్టి వారికి తన ధన్యవాదాలు—అన్నాడు. ఈ స్తుతి వాక్యాలు అన్ని పత్రికలూ ఘనంగా పేర్కొన్నాయి.

యిక్కడ బిందు మాధవరావూ, అక్కడ వికాశమూ ఘట్టిగా పూనుకోవడంవల్ల మీనాక్షీ భరతరావులు పెట్టిన కేసు అమోఘంగా నెగ్గింది. తీర్పు చెప్పినవారం తిరగకుండా పదివేలూ వారి చేతుల్లోకి వచ్చిపడ్డాయి. రమాకాంతం మూడువేలూ పుచ్చుకు కూతురు యింటికి చక్కా వెళ్లాడు.

"ఈ సారి వాన్ బదులు కారుకొంటే?"

"కారూ వొద్దు, వానూ వొద్దు."

"ఏం?"

"మా అమ్మకి మల్లే నేనూ కలరా సోకి చచ్చిపోతే, మీా కేమీా మిగల్చకుండా వెళ్ళిపోనా ?",

"అవేం మాటలు !"

"కాదండి—చెప్పడానికి సిగ్గేస్తోంది."

భరతరావుకి అర్థమయింది; మీానాక్షికి మూడో నెల.

# 11

జీవితంలో ఏది ట్రాజిడీ. ఏది కామిడీ ? చాలా ఘట్టాలు ట్రాజీ కామిక్‌గా ఉంటాయి. ఇంతవరకూ ట్రాజిడీ అనీ, యింతవరకూ కామిడీ అనీ గీత గీసి చెప్పలేము. భరతరావు లాటి సగటు మానవుడికి ఏ అదృష్ట ఫలంవల్లనో అరుణాదేవి లాటి అపూర్వ వ్యక్తి తటస్థపడి అనురాగ వీక్షణాలు కురి పించడం కామిడీ కాక మరేమిటి ? అలాటప్పుడు ఈ భరత రావు, డిప్టీ కలెక్టర్ మూడో కొడుకు భరతరావు, పెద్దన్న డాక్టరుగానూ, చిన్నన్న డిఫెన్సు ఫోర్సులోనూవున్న భరత రావు. బి. యె. పాసై పదిమందిచేతా బుద్ధిమంతు డని అని పించుకున్న భరతరావు, వృద్ధిలోకి రాదగ్గ భరతరావు—కులగోత్రాలు లేని ఒక నటిని వుంచుకొని, ఆమే తనూ కలిసి వినోద ప్రదర్శనా లంటూ యావదాంధ్రదేశం తిరగడం మర్యాదస్తుల దృష్టిలో నిరాక్షేపణగా ట్రాజడీ. కాని భరత రావుకి యిది ట్రాజడీ కాదు; కామిడీ కాదు—నికార్సయిన జీవితం. సుఖ దుఃఖా లేవోవో వస్తూవుంటే వాటిని అతను ప్రశ్నించక గాలిపాటున కొట్టుకుపోతున్నాడు.

"ఇలా చేశావేమి, మీనా?" అని అడిగాడు భరతరావు.

"మీకు పిల్లలు యిష్టం లేదా? యిష్టమే ననుకున్నాను." అంది మీనాక్షి ఎక్కువ మాట్లాడడానికి బిడియపడుతూ.

"కళకి అంకితమైపోయిన మన జీవితాల్లో ఈ సామాన్య కుటుంబ సౌఖ్యాలకి వ్యవధి ఎక్కడ ఉంటుంది!"

మీనాక్షీ భరతరావు యిన్నాళ్ళూ కామ్రేడ్స్‌లా మసిలారు. ప్లాట్‌ఫారమ్‌మీద కూచుని సాంబారు పాకెట్లు తిన్నారు; ఏమీ దొరక్కపోతే అరిటిపళ్ళు కొనుక్కు తిన్నారు; జేబులో వంద రూపాయిలు వుండి కడుపు మండిపోతున్న రోజులూ తెలుసు—టికెట్లు కొన్నమీదట ఎనిమిదణాల కాని వుంటే, ఆ ఎనిమిదణాల కానితో మద్రాస్ చేరుకున్న రోజులూ తెలుసు; మనుషులు పోగిడి నప్పుడూ, ఈలలు వేసినప్పుడూ కూడా వారు చలించలేదు. తా మేదో ప్రజాహిత కార్యంచేస్తున్నామనే భావన వారి కష్టాలన్నీ బాధలనీ మటుమాయం చేసింది. ఆ భావ బలమే వారికి గొప్ప శక్తి నిచ్చింది.

"పారబా టంటారా?" అంది మీనాక్షి భయపడుతూ, ఆమెకి గురుడు, దైవం, హితుడు, పతి, చెలికాడు, ఆత్మ సఖుడు—సమస్తం భరతరావే మనసులో మాట అతనికి గాక యింకెవరికి చెప్పుకుంటుంది?

బాధ్యత తలుచుకుంటే భరతరావుకి భయం భయంగా ఉంది. పుట్టబోయే పిల్లని ఎవరు చూస్తారు, ఎవరు పెంచు

తారు ? కన్ను పోడుచుకున్నా "నా" అనేవాళ్ళు చుట్టు పక్కల ఎవరూ లేరే! పోనీ, ఒక "ఆయా" ని పెట్టవచ్చు. కాని యిన్నాళ్ళూ యింట్లో గోళ్ళు గిల్లుకుంటూ కూచుంటే ఎలా ? ఆ పదివేలూ తినడం మొదలు పెడితే ఎన్నాళ్ళు వస్తాయి ? ఈ లోపున ప్రజాదరణ తనుకి తగ్గిపోదూ ?

వెనక అమెరికా వెళ్ళడం ఖాయం మనుకుంటే మీనాక్షి తల్లి చచ్చి వూరుకుంది ఇప్పు డేదో పచ్చపచ్చగా పైకి వస్తున్నా మనుకుంటే, మీనాక్షి పిల్ల నెత్తుకునే స్థితి తెచ్చుకు కూచుంది.

"మీ రంత దిగులుపడతా రెందుకు ? ఒక్క నాలుగు నెలల విశ్రాంతేగా కావలసింది. ఇంకో రెండు మూడు నెలలు మనం ప్రదర్శనలు యివ్వవచ్చు అదీగాక, ఈ కేసులూ హడావుడీ అయిన మీదట మనం మానేస్తే కూడా బావుండదు. జడుసుకున్నా ననుకుంటుంది లోకం. పత్రికలన్నీ మనని తెగ పొగుడుతున్నాయా-యిదే టైము—అంది మీనాక్షి, భరతరావు మనసు గుర్తెరిగి.

భరతరావుకి ఆ ధోరణినచ్చింది. కాలపురుషుడికి షేక్ హాండ్ యిచ్చి, "వహా డు యు డు" అనడంలోనే ప్రాణానికి సుఖం ఉండనుకున్నాడు.

ఈ సారి రమాకాంతం గునిస్తే, మరోకణ్ణి కుదిర్చారు. వెనకటి డ్రయివరే మళ్ళీ చేరాడు. ఎనిమిదివేలు పోసి వాన్ కి బదులు చిన్న కారు కొన్నారు—మిగతా రెండు వేలూ బాంకులో నిలవ ఉంచారు.

ఈ సారి వరంగల్లూ, హైదరాబాద్ వైపులకి పోయూరు. సికింద్రాబాద్ క్లబ్బులో యిచ్చిన ప్రదర్శనకి 214 రూపాయలు వసూలయింది. అందులో ఒక వంద రూపాయిల నోటు వుంది. వంద రూపాయిల నోటు డబ్బాలో పడటం అదే మొదటిసారి. ప్రదర్శన అయిన తర్వాత షెర్వానీ వేసుకున్న ఒక రెడ్డిగారు వారిని ఎంతో ఘనంగా మెచ్చుకున్నాడు. ఆ ధర్మబుద్ధి ఆయనిదే అయి వుండాలని మీనాక్షీ భరతరావు లనుకున్నారు.

ఏమయితేనేం, మీనాక్షికి ఆరో నెల వచ్చేదాకా ప్రదర్శనాలు యిచ్చి మద్రాస్ చేరుకున్నారు. వారి ట్రేడుకి కాంపిటీషన్ లేదు. ఎలాగనగా ? యింకో యువకుడు యిలాంటి సంస్థ లేవదియ్యదలుచుకుంటే, మొట్టమొదట మీనాక్షిలాంటి మనిషిని వెతుక్కోవాలి. ఆమె మనోవాక్కాయ కర్మలా మీనాక్షిలాంటిదై ఉండాలి. లక్షలు కుమ్మరించినా అలాంటి మనిషి ఎక్కడ దొరుకుతుంది ? మీనాక్షీ మీనాక్షే !

తర్వాత భరతరావు ఈ రెండున్నర ఏళ్ళలోనూ ప్రజాభిరుచిని ఆకళింపు చేసుకున్నాడు. హరికథలూ, బుర్రకథలూ ఎలా ఆసక్తితో వింటున్నారో, అలాగే నాటక ప్రదర్శనలు కూడా చూస్తున్నారు. టిక్కెట్టు కొని రమ్మంటే వాళ్ళు రారు. ఆ పద్ధతి వారి రక్తంలో లేదు. చూస్తారు—చూసిన మీదట రుణ ముంచుకోరు. తమ జేబులోనో, బొడ్డులోనో

పావలా కాసు కూడా లేకపోతే, పక్క ఆసామీని అడిగి అయినా, ఆ డబ్బాల్లో తమకి తోచినది పడేసి, తేలిక మనసుతో యింటికి వెళ్తారు.

భరతరావు సర్కారు పల్లెలలోనూ, తెలంగాణా పల్లెలలోనూ, రాయలసీమ పల్లెలలోనూ వేరువేరు ప్రదర్శనలు యిచ్చాడు. వారి ప్రాంతీయ పదాలు గుర్తెరిగి, వాటిని తమ సంభాషణలలో విసిరేవాడు. కర్నూల్ క్లబ్బులో ఆడిన నాటకం బెజవాడ క్లబ్బులో పనికొచ్చేది గాని, పల్లెల విషయంలో అలా కుదిరేది కాదు.

మీనాక్షికి ఆరో నెల రావడంతో యిద్దరికీ నాలుగైదు నెలలపాటు విశ్రాంతి చిక్కింది. వెనకటి రెండువేలకి మరొక మూడు వేలు జత అయ్యాయి. భరతరావులో పెద్ద మార్పేమీ లేదు గాని మీనాక్షి మొహంలో ఆనందమూ, తృప్తి కన పడసాగాయి. ఎప్పుడూ లేనిది ఒక నెల్లాళ్ళపాటు యింటి పట్టున ఉండటంవల్ల మనిషి నేవళంగా తయారయింది, కాస్త బుగ్గలు వచ్చాయి; భరతరావు వుడికిస్తూ వుంటే సిగ్గుపడటం కూడా వచ్చింది. భరతరావు బి. యె. తన నాటకానుభవాలు ఒక ప్రఖ్యాత పత్రికకి సీరియల్‌గా రాయడం మొదలెట్టాడు. ఆ రాయడం యింగ్లీషు పత్రికకి రాసేవాడు, తెలుగు పత్రిక తర్జుమాచేసి వేసుకునేది.

మీనాక్షికి ఏడో నెల వచ్చిన తర్వాత లేడీడాక్టరు పరిశీలించి సుఖ ప్రసవ మవుతుందని చెప్పింది. అబ్బాయి

పుడతాడా, అమ్మాయి పుడుతుందా—అనే విషయంమీద బిందుమాధవరావూ, అతని భార్యా అయిదువందల రూపాయల పందెం కాశారు. అబ్బాయని అతనూ, అమ్మాయి అని ఆవిడా.

ఒక సాయంత్రం బీచి వొడ్డున పచారు చేస్తూ వుండగా మీనాక్షీ భరతరావులకి అరుణాదేవీ వికాశమూ కనిపించారు. పరిచయాలు అయిన మీదట నలుగురూ పోయి యిసుకలో కూచున్నారు. భరతరావు అరుణాదేవిని, మూడేళ్ళ క్రితం కారు దగ్గరికి సాగనంపడానికి వచ్చిననాడు, చూడటమే; మళ్ళీ—చూడలేదు. చూడాలని కూడా అనిపించలేదు. అరుణాదేవీ మీనాక్షీ కలుసుకోవడం యిదే మొదటిసారి. వికాశమ్ మట్టుకు ఆ కేసు సందర్భంలో ఒకసారి భరతరావు యింటికి వచ్చాడు.

"డాడీ క్షేమంగా ఉన్నారా?" అని అడిగాడు భరతరావు అరుణాదేవిని.

"సింగపూర్ వెళ్ళారు. ఆయనకోసమే ఎదురు చూస్తున్నాను. ఆయన రాగానే వెళ్ళిపోవాలి. మిచిగన్ యూనివర్సిటీలో సీటు దొరికింది." అంది అరుణాదేవి.

అరుణకీ, మీనాక్షికీ ఒక పది నిముషాలు ఏమి మాట్లాడుకోవాలో తెలీలేదు. తర్వాత యిద్దరూ మాటల్లో పడ్డారు. తనకంటె మీనాక్షి అందంగా ఉంటుందని చూసీ చూడగానే అనుకుంది అరుణాదేవి. మీనాక్షి కట్టుకున్న

జార్జెట్ చీరె వొంటికి పట్టుకుని, పురుష హృదయాన్ని ప్రారిస్తున్నట్టు వుంది.

"రేపు మధ్యాహ్నం మా యింటికి టీకి, సరిగ్గా నాలుగు గంటలకి"—అది అరుణాదేవి పిలుపు.

"ఎందుకీ ఆహ్వానాలు—దూర దూరంగా వుంటేనే అందరికీ బావుంటుంది"—అన్నట్టు మొహంపెట్టి, అరుణాదేవి ఎలాగూ రాదనుకుని, "రేపు మీరే రాకూడదూ మా యింటికి?" అన్నాడు భరతరావు.

"మొదట నేను పిలిచాను కనుక, రేపు మీరు మా యింటికి. ఎల్లుండి మేము మీ యింటికి. ఏమన్నయ్యా?" అంది అరుణాదేవి విశాశమ్ని కలుపుకుంటూ.

కొత్తగా అలవాటు చేసుకుంటున్న పైపు నోట్లో నుంచి బయటికి తీసి—ఒ. కె. ఒ. కె.—అన్నాడు.

"ఏమంటావు మీనాక్షీ! రేపు డాక్టరు దగ్గిరికి వెళ్ళాలేమో!" అన్నాడు భరతరావు.

"డాక్టరు దగ్గిరికి ఉదయంగా వెళ్ళేది!" అంది అమాయకంగా మీనాక్షి.

"మీరు రాకపోతే మానె, మీనాక్షి వస్తుంది. మీరు వస్తారుగా?" అంది అరుణాదేవి భరతరావుని తోసిరాజని, మీనాక్షిని చనువుచేసుకుంటూ.

"ఆయనా వస్తారు; ఆయన మాత్రం ఎందుకు రారు?" అంది మీనాక్షి.

"ఆయనకి మొదటినుంచీ బెట్టు చెయ్యడం అలవాటు." అంది అరుణాదేవి చిలిపిగా. ఇద్దరు స్త్రీలూ కలిసి నవ్వుకుంటే, భరతరావు యిబ్బంది పడ్డాడు.

కారులో యింటికి వస్తున్నప్పుడు మీనాక్షిని అడిగాడు; "ఎందు కొప్పుకొన్నావ్ వాళ్ళ యింటికి వస్తానని ? వాళ్ళు గర్వపోతులు. మూడేళ్ళబట్టీ పనికిరానివాళ్ళము యిప్పుడు పనికివచ్చామా ?"

"పోనిద్దురూ ! మనకి ఆ కక్ష లెందుకు ? వికాశమ్‌గారు మనకి ఎంత సాయం జేశారో ఆలోచించండి. ఆ అమ్మాయి మాటలకి భ్రమసి కాదు, ఆయన మొహం జూసి—వస్తానన్నాను. మనం రామని నిష్కర్షగా చెబితే, ఆయన చిన్నబుచ్చుకోడూ ?"

"వికాశమ్ వాటికి అతీతుడు."

"ఎంతయినా, ఉప్పూ పులుసూ తింటున్న మనిషిగా !"

"అరుణాదేవితో చాలా జాగర్తగా మసులుకోవాలి నువ్వు. ఆ అమ్మాయి మనకి దగ్గరసా రావడం నాకు యిష్టం లేదు. అనుకోకుండా తటస్థ పడ్డారు యివ్వాళ."

"రేపు టెల్లుండిలో మనింటికి వద్దా మనుకుంటున్నారట"—

"నిజమా ? నేను నమ్మను, అబద్ధం."

"అబద్ధమని ఎందు కనుకోవాలి ? అమెరికా వెళ్ళబోయే లోపున మీకు చెప్పి వెళ్దా మనుకుందట."

"అదా? 'నువ్వు వెళ్ళలేకపోయావ్, నేను వెళ్ళుతున్నాను సుమా' అని చెప్పేందుకు కాబోలు, మీనాక్షి పది అమెరికాల ఎత్తు" అని ఆమె భుజంమీద చెయ్యి వేశాడు భరతరావు.

"అరుణాదేవిని చూసి మీ రెందుకలా జడుసుకుంటారు? ఆమెకు లేనిసిగ్గు మీకెందుకు? సర్భతిగా మాట్లాడండి."

"ఆమె మంచి మనిషి కాదు."

"చెడ్డదీ కాదు!"

"ప్రమాదకరమైన మనిషి."

"ఆ...యింతదాకా వచ్చినతర్వాత మిమ్మల్ని ఎత్తుకుపోయి ఏం చేసుకుంటుంది?"

ఆ ధైర్యమే గనక మొగవాడికి వుంటే లోకాలు జయించడూ? కాని, ఉండదు. భరతరావులాటి వాడికి అసలు ఉండదు.

మర్నాడు టీ వేళప్పుడు వికాశమ్ అన్నాడు: "నేనే గనక ముఖ్య మంత్రి నయితే, నిన్ను యంటర్‌టెయిన్‌మెంట్ మినిస్టర్‌గా చేస్తాను?" అన్నాడు భరతరావుతో. "పాపము శమించుగాక!" అని చెవులు మూసుకుంది అరుణాదేవి. మీనాక్షి పక పక నవ్వి చీరెమీద టీ వొలకబోసుకుంది.

## 12

మీనాక్షికి తొమ్మిదోనెల వచ్చింది. సింగపూర్ నుంచి వచ్చిన డాడీ స్విట్జర్లాండు వెళ్ళడంతో అరుణాదేవి అమెరికా

ప్రయాణం యింకొక నెలరోజులు వాయిదా పడింది. బిందు మాధవరావు మీనాక్షి పట్ల తనకి వున్న అనురాగాన్ని ఎలా మార్చుకున్నాడో, అలాగే అరుణాదేవి కూడా మార్చు కున్నట్టు కనిపించింది—పైపైకి. పెద్ద భవంతిలో సర్వెంట్ల మధ్య వుండటం కంటే మీనాక్షి యింట్లో కూరలు తరు క్కునే కత్తిపీట ముందు కూచోడం బావుండేది అరుణకి అప్పుడప్పుడు. నిత్యమూ కూరలు తరుగుతూ కూచోడమూ బావుండదు.

భరతరావు నామరూపాలు లేకుండా పాతాళబిల ప్రవా హంలో కొట్టుకుపోయి వుంటే, అరుణాదేవి కసితీరేదేమో! కాని, అలా జరగక మరొకలా జరిగిపోయింది. కలగోత్రాలు లేవనుకున్న మీనాక్షిలో కూడా కొన్ని సుగుణాలు కనిపించ సాగాయి అరుణకి. అంతేగాక, ఆమె చాలామంది స్త్రీల కంటె ఉత్తమురాలనుకుంది.

''బెండకాయ ముదిరినా, 'బ్రహ్మచారి ముదిరినా' అని నేను మా వారికి చెబుతూనే వున్నాను. ఇది అసలు మా యింట్లోవున్న భాగోతమేను. ఈ మీనాక్షి ముత్తవతల్లి యిల్లు మా మేనమామ యింటిపక్కనే పాపం. సంసారం చితికిపోయి, యిలా నాలుగుమూలలకీ వచ్చిపడ్డారు''అని చారిత్రక హంశాలు చెబుతూ ఒక మిట్టమధ్యాహ్నం మాతృశ్రీ టాక్సీలోనుంచి, దిగేటప్పటికి, భరతరావు పై ప్రాణాలు పైనపోయాయి.

మీనాక్షి అత్తగారికి కాళ్లు కడుక్కునేందుకు నీళ్ళు యిచ్చి, డ్రయివర్ని ప.పి కారియర్‌తో భోజనం తెప్పించింది. "శుభమా అని నువ్వు పెళ్ళిచేసుకుంటూ వుంటే, మేము వొద్దంటామా—నాయనా! ఇన్నిసార్లు ఊరూరా తిరిగావు గాని ఒక్కసారి యింటి చాయలకి రాలేదు. ఈ రోజుల్లో కులా లెవరు చూస్తున్నారు—గుణం ప్రధానం గాని!" అని పురాణం చదివింది తల్లిగారు.

కోడల్ని తీసుకు వెళ్ళి పురుడు పోస్తారట. అందుకు వచ్చిందామె. మీనాక్షి అంగీకరించలేదు. అత్తగారినే యిక్కడ వుండిపొమ్మంది. మరొక పదిహేను రోజులు పోయినతర్వాత వస్తానని అత్తగారు వెళ్ళిపోయింది—

కొడుకుని మాత్రం ఆమె ఒక మాట అడిగింది! "ఏమైనా వెనకేశావా?"

"ఆ...నిలవ చేసేటంత ఏమి మిగులుతుంది?"

మీనాక్షి భరతరావులు స్టేషన్‌కి వెళ్ళి మాతృశ్రీని రైలు ఎక్కించి వచ్చారు. తన పరువు ప్రతిష్ఠలు పెరగడం భరతరావుకి తమాషాగా ఉంది. అరుణాదేవికోపం పోయింది; తల్లికోపం పోయింది; లోకమంతా తనని ఆమోదించే స్థితికి వచ్చేస్తూంది.

పదిహేను రోజుల తర్వాత వస్తానన్న తల్లి ఏ కారణం వల్లనో రాలేదు. శకుంతలా నర్సింగ్ హోమ్‌లో మీనాక్షి పురుడు పోసుకుంది. చక్కటి ఆడపిల్ల కలిగింది. బిందు

మాధవరావు వోడిపోయాడు; అతని భార్య పందెమే నెగ్గింది. పురుటివేళ బిందుమాధవరావు భార్యా, అరుణాదేవీ మీనాక్షికి ఎంతో సాయపడ్డారు.

రేపు పొద్దున్న యింటికి పోవచ్చు నన్నారు డాక్టరుగారు. బిల్లులూ అవీ చెల్లించి, మిగతా ఏర్పాటులు చేసేటప్పటికి ఏడున్నర అయింది. బిందుమాధవరావు భార్య వెళ్ళి పోయింది; అరుణాదేవి ఒక్కతె మీనాక్షిదగ్గిర ఉంది. పాపని ముద్దాడుతూ, పొద్దుటే వస్తానని భరతరావు మీనాక్షితో చెప్పాడు. ఆతనితోపాటు అరుణాదేవి కూడా లేచింది.

"మీరు నన్ను డ్రాప్ చెయ్యాలి యివ్వాళ." అంది అరుణాదేవి మెట్లు దిగి కిందికి వచ్చిన తర్వాత.

"మీ కారేమయింది?"

"అన్నయ్య తీసుకు వెళ్ళాడు"

ఈ మూడు నెలలబట్టీ అరుణా తనూ ఏకాంతంగావుండే అవకాశం రాకుండా కాపాడుకుంటున్నాడు భరతరావు. అరుణ ఎందు కిలా చేసిందా అను సంశయాకుల చిత్తంతో స్టీరింగ్ ముందు కూచున్నాడు.

"నాకు దాహం అవుతూంది. ఎక్కడయినా మంచి సోడా యిప్పించండి."

సోడా తాగిన మీదట భోజనం మాట ఏమిటంది. తనకి ఆకలి లేదన్నాడు భరతరావు. ఆమె ఎలాగా అంటుందని

తెలిసినవాడు కాబట్టి బీచి రోడ్డమ్మటే కారు తీసుకు వస్తున్నాడు.

"ఇక్కడ కాసేపు ఆపండి" అంది నేపియర్ బ్రిడ్జి దాటిన తర్వాత.

"ఈ రాత్రిని మీరు నాకు ప్రజెంటుగా యిచ్చెయ్యరూ?" అంది అరుణ.

"నా చేతుల్లో వున్నది నే నెప్పుడయినా దాచుకున్నానా ?"

"మీరు గుప్పెట విప్పితే కదా! ఎప్పుడూ గుప్పెట మూసుకునే వున్నారు."

"గుప్పెట తెరిపించే మంత్రశక్తి మీలో లేకపోయింది"

"బావుంది, బావుంది. మీరు నన్ను మీ రనడం బావో లేదు—నేను మీకంటె చిన్నదాన్ని—మీరు నాకు గురుతుల్యులు. టెన్నిస్ నేర్పారు, ప్రేమ నేర్పారు. సహనం నేర్పారు."

"అబ్బే అబ్బే—యింక చాల్లెండి."

"అదిగో, ఆ అండీలూ గిండీలూ వొద్దు"

"మిమ్మల్ని నేను మీరనే అంటాను ఒప్పుకు తీరవలసిందే, 'మర్యాద యిచ్చి పుచ్చుకో' మన్నారు."

"ఆల్‌రైట్, ఉడ్‌లాండ్స్‌కి వెళ్ళి అన్నం తిందాం, సినీమాకి వెళ్ళుదాం, ఆ పైన బీచికి వద్దాం. తెల్లారే దాకా యిక్కడ కూచుని కబుర్లు చెప్పుకుందాం."

"కబుర్లు చెప్పడం నాకు చేతకాదే?"

"నాటకాలు వెయ్యడం చేతనయిన వాళ్ళకి కబుర్లు చెప్పడం చేతకాదులెండి."

ఇది భరతరావుకి గడ్డురోజు, అరుణాదేవి మనసు నొప్పించకుండా తను బయటపడాలి. పైకి కటువుగా మాట లన్నప్పటికీ ఆమెది వెన్నలాంటి మనసు. సినీమాలో యింట ర్వెల్ దాకా కూచోకుండానే, యింటికి పోదామంది.

"వెళ్ళి?" అన్నాడు.

"ఏమీ లేదు."

కారు మళ్ళీ బీచివొడ్డున పార్కు చేశాడు భరతరావు. అరుణాదేవి కలవరపాటు అతనికి అర్థమవుతూంది. ఎండిన హృదయంమీద పన్నీరు పొయ్యడం చాలా ప్రమాదం. కాని యిప్పటికే పన్నీరుతో తడిసిపోయి వుంది ఆమె మృదు హృదయం.

అరుణాదేవి తన తల అతని భుజంమీద ఆనించడం గాక వొళ్ళోకి వొరిగి పోయింది. చక్రంలో ఆమె తల వెంట్రుకలు యిరుక్కోకుండా చూశాడు. ఆమె పెదవులు వొణుకు తున్నాయి; తల గిర గిరా తిరుగుతూందట. భరతరావు చెంపలు నిమురుతూ చెక్కిలిమీద వుంచిన చెయ్యిని అరుణాదేవి తన పెదవుల దగ్గిరికి తీసుకుంది. ఆమె వేడి

శ్వాస, వెచ్చటి కన్నీళ్ళూ అతనికి మీనాక్షిని జ్ఞప్తికి తెచ్చాయి.

తను నిజంగా నిర్దయుడు. వలచిన స్త్రీని కత్తి కోతకి బలిచేసి గాని మనసు అర్పించడు. తనకి కావలసింది స్త్రీ కాదు, కళ. వెనకేమో గాని యిప్పుడు తను కళకి బానిస. మీనాక్షి తనతో పాటు కళకి వూడిగమైనా చేస్తుంది. ఈ అరుణ తన కెందుకు ? ఆమె అంతస్తు వేరు, తన అంతస్తు వేరు. అదీగాక తను మీనాక్షికి అన్యాయం చెయ్యలేడు.

బుద్ధిని అనుసరించి మనుష్యులు నడవగలిగిన నాడు లోకంలో యిన్ని కథలూ కావ్యాలూ ఉండవు. బుద్ధి కట్టే ఏడంతస్తుల మేడని తృటిలో కూలదోస్తుంది ఫీలింగ్ (చిత్త ప్రవృత్తి). మనుష్యులు చేసే కార్యకలాపాలన్నీ చిత్త ప్రవృత్తి ప్రకారం జరుగుతున్నాయి; బుద్ధి ఫీలింగ్‌కి దాస్యం చేస్తూ తెర మరుగున పడిపోతుంది.

అరుణాదేవి అతన్ని వశ్యం చేసుకోవాలని సకల విద్యలూ ఉపయోగించడమూ, ఈ ఉపద్రవం నుంచి ఉష్ట్రపక్షిలా పారిపోవాలని భరతరావు ప్రయత్నించడమూ స్త్రీ పురుష స్వభావాల నైజం. తెల్లారి లేచి, రెండు చేతులూ మెడకి పెనవైచి, 'భరత్' అని అరుణ అంటున్నప్పుడు, మీనాక్షి, యింట్లోనే మీనాక్షి, సొత్తు దోచుకున్నాననే

మనస్తాపం కూడా ఈమెకి లేదా-అనిపించింది భరతరావుకి. కాని అలా అనుకున్ననాడు అరుణ భరతరావుకి తన కన్యాత్వాన్ని ఎందుకు అర్పిస్తుంది ?

పాప పేరిట నలుగురినీ పిలిచి భోజనాలు పెట్టాడు భరతరావు. పైకి ఖులాసాగా కాలం గడుస్తూంది. కాని, లోలోన తప్పు చేసినవాడిలా బాధ పడసాగాడు. అరుణలో మాత్రం ఆ ఛాయ లేమీ లేవు. పిల్ల నెత్తుకు ముద్దెట్టుకుంటూ కొంటెగా అతనివంక చూసేది. ఎవరైనా చూస్తారేమోనని అతని భయం.

పిల్ల పుట్టిన ఇరవై నాలుగోరోజున కాబోలు మీనాక్షికి కాస్త జ్వరం తగిలింది. రెండు రోజులు అశ్రద్ధ చేశారు. నాలుగోరోజు మధ్యాహ్నం డాక్టర్ అది టైఫాయిడ్ అన్నాడు. బిందుమాధవరావు భార్య పురిటికి వెళ్ళడంవల్ల, ఆ టైఫాయిడ్‌లో అరుణ మీనాక్షికి ఎంతో సాయపడింది. కంటికి రెప్పలా కాచింది. మీనాక్షిమీద అరుణకి వుండే శ్రద్ధకి భరతరావే ఆశ్చర్యపడి, అందుకే స్త్రీ హృదయాన్ని అగాధ మన్నా రనుకున్నాడు. మీనాక్షికి పదమూడోరోజు మధ్యాహ్నం రెండు గంటలకి ఉన్నట్టుండి, సంధి పుట్టుకొచ్చింది. ఆ సాయంత్రం అయిదు గంటలకి ఆయాసం ఎక్కువయింది. సూర్యాస్తమయం కాక పూర్వమే ప్రాణాలు వొదిలేసింది.

భరతరావు మూడేళ్ళలో మూడు చావులు చూశాడు. ఈ మూడూ అతని వయసుకి ఒక్కొక్క దశ చొప్పున కలుపుకుంటూ వచ్చాయి. మీనాక్షి తల్లి మీనాక్షిని వొప్పచెప్పి పోతే, మీనాక్షి తన కూతుర్ని వొప్పజెప్పి పోయింది. అక్కడ పరాయిఅమ్మ గనక చేతిలో చెయ్యి వేయించుకుంది. ఈమె అలాటి కడసారి పలుకులు చెప్పక్కర్లేకుండానే కళ్ళు మూసింది.

ఇక్కడ తల్లి చచ్చి పడివుండగా, అక్కడ పక్కగదిలో పాప కేరు కేరున ఏడుస్తూంటే, అరుణ ఆ పాపని వొళ్ళో పడుకోబెట్టుకు, పాలపీకె నోట్లో పెడుతూ వుండటం చూసి భరతరావు పెద్ద పెట్టున ఏడ్చాడు.

"తప్పు, మీరు ఏడవకూడదు" అని శాసించింది అరుణాదేవి. శ్రీమంతుల యింట్లో షిఫాన్ చీరెల్లో పెరిగిన ఆమె మనసు కూడా అందరి మనసుల్లాటిదేననీ, దానికూ్కడా కష్టం చూస్తే ద్రవీభూత మయ్యే లక్షణం ఉందనీ భరతరావు కళ్ళారా చూసి తెలుసుకున్నాడు.

మీనాక్షిని మట్టి చేస్తున్నప్పుడు ఏకధారగా ఏడ్చాడు భరతరావు. అగ్ని అంటించలేక అతని చేతులు వణికితే పురోహితుడు అంటించాడు. అక్కడితో కథా సమాప్తి అయింది. నాటకం తెర పడిపోయింది. ఇంక నాటకమూ

లేదు. ఎవరూ లేరు. అంతా శూన్యం తనని ఈ లోకానికి బంధించే నెల్లాళ్ళ పసిగుడ్డు. ఆ పసిగుడ్డే మీనాక్షి. ఇది పెద్దదై మీనాక్షి అంత అవాలి. కాని దీనిని పెంచడ మెలా? నెల్లాళ్ళ పసిగుడ్డుని పెంచడం మాటలా? వికాశమ్ "మిషనరీలకి యిస్తే?" అన్నాడు. భరతరావు అందుకు ఒప్పుకోలేదు.

భరతరావు తల్లి వొచ్చి ఈ పసిగుడ్డుని తన వెంట తీసుకు పోయింది. భరతరావునికూడా రమ్మంది.

చూదామన్నా డతను.

స్విట్జర్లాండునుంచి డాడీ వచ్చాడు. అరుణాదేవి అమెరికా వెళ్ళేందుకు ఏర్పాట్లన్నీ అయాయి. ప్రయాణం ఇంకా రెండు రోజులు ఉండనగా భరతరావుని అడిగింది; "నన్ను అమెరికా వెళ్ళమంటారా?"

"వెళ్ళి రా."

"మరి—నేను మీకు అఖ్కర్లేదా?"

"నువ్వు వేసే ప్రశ్న నీసంస్కారానికి తగినట్టు లేదు."

"నేను కూడా లేకపోతే మీ రేమైపోతారో?"

"ఏమీ అవను. రెండేళ్ళంటే ఎంతలో గడుస్తాయి! నువ్వు నాకోసం మూడేళ్ళు కనిపెట్టుకు వుండలేదూ?"

అరుణాదేవికి మీనంబాకమ్‌లో సెండ్ ఆఫ్ యిచ్చి వచ్చిన తర్వాత, మూడు పగళ్లూ మూడు రాత్రుళ్లూ లోకంమొహం చూడలేకపోయాడు భరతరావు. చచ్చే

దాకా మనిషి బతకాలిగనక, తనుకూడా బతక్క తప్ప దనుకున్నాడు. మీనాక్షి తన కిచ్చిపోయిన పసిగుడ్డుగురించి మాత్రం కలలెందుకు ? అరుణ అమెరికానుంచి వచ్చి తనను అందల మెక్కిస్తుం దనుకోవడమూ లేదు; ఆనాడు హరి శ్చంద్ర నాటకం వేసినందుకు విచారించడమూ లేదు.

ఇది మాయామేయ జగమ్ కదా అని అతని హృదయ కమలం మూసుకుంటోంది—అంతే.

సమాప్తి.

